JAGATI Rs 2-00 March 1987

32nd Year of Publication




మార్చి - 1987



'బృంద గానం'

—'సోవియట్ భూమి' సౌజన్యంతో

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 — సం॥ చందా రు. 24-00. 2 సం॥లకు రు. 45-00. 5 సం॥లకు రు. 100-00 జీవిత చందా రు. 300-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం: పరిశ్రమల మంత్రి వెంగళరావు

# నిమ్మతొనలు

మన పెళ్లి అయిన తర్వాత నేను ఉద్యోగం చేయడం నీకు ఇష్టం లేకుంటే మానేస్తాను - ఏమంటావ్? - అంది సుందరి.

'చంపావ్ అంత పని మాత్రం చేయకు. నీవు ఉద్యోగం మానేస్తే మనం బ్రతకడమెలా? నాకు ఉద్యోగం లేదు, నీకు వున్నది అందుకనేగా పెళ్లి చేసుకుంటున్నది'

—ఎ శ్రీనివాసమూర్తి
నెల్లూరు-2

ఏం జోగయ్యా బాగున్నావా? పిల్లలెంత మంది?' అడిగాడో పాత మిత్రుడు.

'మూడుకుంపట్లు, ఒక లక్కీ లాటరీ టిక్కెట్టు'.

'అదేమిటి?' అర్థంకాక అడిగాడు మిత్రుడు.

'ఏం వుందిలే, అర్థంకాక పోవడానికి? మూడు కుంపట్లు అంటే ముగ్గురమ్మాయిలు, ఆ తర్వాత ఒక కొడుకు లక్కీ లాటరీ టిక్కెట్టుగాడు' - వివరించాడు జోగయ్య.

—రమ్యప్రియ
జగ్గయ్యపేట

మా బాస్ నా వైపు కన్నెత్తి కూడా చూడడు తెల్సా? — అంది టైపిస్టు కల్యాణి.

'అయితే మీ బాస్ చాలా మంచి వాడె వుండాలి' అంది స్నేహితురాలు

'అందుకనేగా నేనతన్ని పెళ్లి చేసుకున్నది.'

—బి చందు
పొన్నమండ

ప్రొఫెసర్ రాజారావు ముందు గదిలో కుర్చీలో కూచుని పేపరు చదువుతున్నాడు సీరియస్‌గా. యింతలో అతని భార్య వచ్చి 'ఏమండీ మీకు గుర్తుందా? పదిహేనేళ్ల క్రితం సరిగ్గా యిదే తారీఖున మనకు ఎంగేజ్‌మెంట్ అయింది'

'ఏమిటీ పదిహేనేళ్ళయిందా? మరి యింత కాలం చెప్పకుండా ఎందుకూరుకున్నావ్? పద, రిజిస్ట్రారాఫీసుకి పెళ్లి చేసుకుందాం — యిప్పటికే చాలా ఆలస్యమైపోయింది' - అని పేపరు మడిచేసి లేచాడు కుర్చీలోంచి ప్రొఫెసర్ రాజారావు.

—యన్ రామకోటేశ్వరరావు
వినుకొండ

మా ఇంటి దగ్గర రోజూ ఆడవాళ్లు స్టంట్ చేస్తుంటారు - అన్నాడు

రాంబాబు.

'నిజమా ?' అని ఆశ్చర్యంగా చూశాడు వెంకట్రావు.

'మునిసిపాలిటీ వారి కుళాయి ఉన్నది మా ఇంటి ముందేగా'

—ఆర్ నాగేశ్వరరావు
మాచర్ల

రేపటి నుంచి నిన్ను కూడా మా బడికి రమ్మన్నారు నాన్నా మా టీచర్ — 'ఎందుకురా ?'

'నా పుస్తకంలో లెక్కలు తప్పు చేసినందుకు'

—కె వెంకటేశ్వరరావు
కొండపల్లి

మధ్యాహ్నం పూట మగువలంతా ఓ చోట చేరి తమ భర్తల గురించి చెప్పుకుంటున్నారు.

'ఎంత చిన్న పనికైనా సరే ఆయన నన్ను పిలుస్తారు నేను పక్కన లేకపోతే ఆయనకేం తోచదు' అంది జానకి

'ఇంకా నయం ! మా ఆయనకేమో చొక్కా కుట్టుకోడానికి సూదిలో దారం నేనే ఎక్కించి ఇవ్వాలి' అంది గౌరి

'సరేలే ! మా ఆయనయితే మజ్జిగలో తోడు ఎంత వెయ్యమంటావ్ ?' అంటూ గావుకేక పెడతారు అంది కనకవల్లి

—కె నాగేశ్వరరావు
నరసరావుపేట

★





# పాఠకుల తీర్పు

శ్రీ చందూర్‌గార్కి: 'జగతి' మాస పత్రిక చాలా ఆసక్తిదాయకంగా, సందేశాత్మకంగా వుంది. ఇన్నాళ్ళు స్నేహితులది తెచ్చుకుని చదువుతున్నాను. ఈరోజే చందాదారుగా చేరాను... బొంబాయి ఆంధ్ర మహా సభలో మీ ఇరువురిని కలుసుకున్నాక, మిమ్మల్ని చూడాలన్న కోరిక తీరినది. నూతన సంవత్సరంలో మొదటిగా రాస్తున్న ఉత్తరం ఇదే. నూతన సంవత్సర శుభాకాంక్షలతో. మీ అభిమాన పాఠకురాలు.

—ఉషారావు

బొంబాయి-44

సంపాదక మహాశయులు యన్నార్ చందూర్ గారికి నమస్కారం. జనవరి '87 'జగతి'లో వావిళ్ళ శత జయంతి సందర్భంగా ఆ సంస్థ తెలుగు భాషా సాహిత్యాల సముద్ధరణకు, జాతీయ భావోద్దీపనకు చేసిన కృషిని కొనియాడుతూ, పెద్దలు విజ్ఞులు చేసిన ప్రశంసా ముఖ్యాంశాలను ప్రచురించి, ఆ సంస్థ వైశిష్ట్యాన్ని గుర్తు చేసినందుకు తమను మనసార అభినందిస్తున్నాను. దయచేసి ఆ సంస్థ ప్రస్తుత చిరునామా ప్రకటింప విన్నపం.

—జానమద్ది హనుమచ్ఛాస్త్రి

కర్నూలు-4

(వావిళ్లా ట్రస్ట్, 490 తిరువత్తూరు హైరోడ్, మద్రాసు-600 021)

సాహితీ బంధువులు యన్నార్ చందూర్‌గార్కి నమస్కారం 'జగతి' ఈ మధ్య ప్రతి నెలా చూస్తున్నాను స్టీరియో టైప్ పత్రికలు చూసి, చూసి విసుగెత్తిన నాకు, మీ పత్రిక తృప్తి నిచ్చింది - సరైన అవగాహన లేని రోజుల్లో మీ పత్రికను అంతగా పట్టించుకోలేదు నూతన్న వరవడిని కోరుతున్న నాలాంటి వారికి మీ పత్రిక 'బుగ్గపై బ్లేడ్ గాటు' లాంటిది 'జగతి' ని జ్ఞాపకం వుంచుకోవాల్సిన అవసరమెంతైనా వుంది. కృతజ్ఞతలతో.

—జి విజయకుమార్

రైతుపేట

డియర్ చందూర్ గారికి నమస్కారములు. కొద్దిరోజుల అనారోగ్యము కారణంగా లెటర్ వేయలేకపోయాను. ప్రతినెలా 'జగతి' లోని 'పసిడి పలుకులు' నాకు మానసికంగా నూతనోత్సాహాన్ని కల్గించి ముందుకు నడిపిస్తున్నాయి. మీకు నా హృదయపూర్వక శుభాకాంక్షలు.

—జి రాము

నందిగామ

# ప్రాచీన సాహితి

బాలిక నన్ను గన్గొనని పట్టున దర్శనమాత్ర మవ్వినం
జాలు నటంచు గోరె మఱి చక్కగ గన్నుల నన్ను జూచి ప్రో
యాలు కవుంగిలింపవలె నంచు దలంచె దమిం గవుంగిటన్
మేలుగ జేర్చుకొన్న నిరు మేనులు నొక్కటి సేయ గోరితిన్

—భర్తృహరి

☀

దాన వైఖరిని రాధా తనూభవు బోలి
చిరభోగమున శచివరుని బోలి
కారుణ్యమున రఘుక్ష్మావరేణ్యుని బోలి
సత్యంబునను హరిశ్చంద్రుని బోలి
న్యాయమ్మునందు గౌంతేయాగ్రజుని బోలి
సాహసంబున సవ్యసాచి బోలి
భూరి విద్యాప్రౌఢి భోజరాజును బోలి
హరి భక్తి నియతి బ్రహ్లాదు బోలి
సర్వ సర్వం సహా భుజా ధూర్వహుడు న
భంగు డగు వాడెపో నృప పుంగవుడు
భూనుత విలాస! పీఠికాపుర నివాస
కుముదహిత కోటి సంకాశ కుక్కుటేశ!

—కుక్కుటేశ్వర శతకం

☀

పతి నీవై విహరింపగా జనము సంభావింపగా బంధు సం
తతి నిన్నుం గొనియాడగా సవతి కాంతల్చూచి లజ్జింపగా
నతుల ప్రాభవవైభవోన్న తుల ప్రోవై యిట్లు వర్తించు నీ
కితర స్త్రీజన బుద్ధి దీవనలు నేనే మిచ్చెద న్మానినీ.

—తిమ్మన 'పారిజాతాపహరణం'

# పాతికేళ్లనా పిక్చర్

## జగపతీ వారి 'ఆరాధన'

అనురాగాన్ని నీ యిష్టం వచ్చిన రీతిని అనువదించుకో - అని అతి లలితంగా అనూరాధకి హితువు చెప్పే సారధి పాత్ర ఈ చిత్రమంతటికీ కడు ఉదాత్తమైనది స్త్రీ పురుష విభేదం గానని స్నేహ మాధుర్యానికి అతను చిహ్నంగా నిలుస్తాడు. శాంతమూర్తి సేవా పరాయణుడూ అయిన ఫాదరీలో (గుమ్మడి) కూడా ఆగ్రహావేశం కనిపిస్తుందిగాని, చెత్తకుండీ కెలక వద్దని విద్యార్థినులని మందలించే ఈ సారధి పాత్రం కథాసారధిగా ప్రేక్షక లోకానికి ఉన్నత విలువలు చూపుతాడు. జగయ్య ఈ పాత్రని ఎంతో హుందాగా పోషించాడు. ఇక పోతే, బెంగాలీ మూలం 'సాగరిక' నుంచి తీసుకున్న ఈ కథ, తెలుగు హాస్యంతో (రమణారెడ్డి, రేలంగి, గిరిజ) మిళతమై వుంది నవీన రాధాకృష్ణులలో మురళీకృష్ణ (నాగేశ్వరరావు) హవుజ్ సర్జన్‌గానూ, అనూరాధ (సావిత్రి) మెడికల్ కాలేజిలో ధర్డ్ యియర్ చదువుతుండగానూ ప్రణయ గాథ ప్రారంభమవుతుంది ఈ మురళీకృష్ణని ప్రేమించిన మరొక అమ్మాయి (రాజశ్రీ) ఉంది. అల్లుల వల అతని ఉద్యోగం పోతుంది లంగరు చినలింగయ్య (రమణారెడ్డి) ధర్మమా అని గోపాలయ్య (నాగయ్య), తన కొడుకు మురళీకృష్ణని పెద్ద చదువు కని లండన్ పంపిస్తాడు. దురదృష్టవశాత్తూ కళ్లు పోగొట్టుకు వస్తాడు కృష్ణ ఫాదరీ చేసిన ఆపరేషన్ ఫలితంగా కళ్లు వస్తాయి - చిత్రం సుఖాంతంగా ముగుస్తుంది మెడికల్ కాలేజీ విద్యార్థినులని అంత వెకిలి పిల్లలుగా సృష్టించడం విద్యార్థినీ లోకానికే తలవంపుగా వుంది మెడికల్ స్టూడెంట్స్ తల నిండా పువ్వులు పెట్టుకు వార్డ్స్‌లోకి వెళ్ళరనే విషయం దర్శకునికి తెలియదా? అనూరాధకి 'నా' అన్నవాళ్లు ఎవరూలేరా? అంత యిల్లు ఎలా మెయిన్‌టెయిన్ చేయగలుగుతోంది? లండన్‌లో కృష్ణ పనిచేసినదిమెడికల్‌లాబ్‌లోనా, కెమిస్ట్రీ లాబ్‌లోనా? ఎంత ప్రణయ సౌరభలేఖ అయినప్పటికీ, యింటికి వస్తుంది గాని లాబ్ కెందుకొసుంది? కృష్ణ కళ్లు పోవాలి గనక అలా జరిగిందని సమాధానం చెప్పుకోవాలి ఇటువంటి లోపాలు కొన్ని ఉన్నప్పటికీ ఉత్తమ ప్రయత్నం చేశారు నిర్మాతలు. మాటలూ, పాటలూ బావున్నాయి. క్లిష్టమైన పాత్రని సావిత్రి ఎంతో రసవత్తరంగా పోషించింది. నిర్మాతలు: రంగారావు, రాజేంద్ర ప్రసాద్. దర్శకులు మధుసూదనరావు.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' మార్చి 1962

★

# వెన్నెల కెరటాలు

## దివాకరాస్తమయం

1986 అక్టోబర్ 21వ తేదీన ఆచార్య కళాప్రపూర్ణ డా॥ దివాకర్ల వేంకటావధానిగారు స్వర్గస్థులైనారు ఆంధ్ర సాహిత్య జగత్తు సహస్ర జ్ఞాన కిరణుని కోల్పోయింది అవధానిగారు సమకాలీన సాహిత్య ప్రపంచంలో ప్రాచీన కవితాధోరణికి ఆలంబనంగా నిలిచారు, అనిఅయన ఆధునిక సాహిత్య ధోరణులను నిరసించలేదు ఎక్కడ ఉన్నా గుణాలను గ్రహించటం వాటిని ప్రకటించడం వారి స్వభావం. ఏదైనా కావ్యం గాని, నవల గాని మరియే యితర ప్రక్రియకు చెందిన గ్రంథం గాని వారికిచ్చి అభిప్రాయం చెప్పమంటే అందులోని గుణాలనే పేర్కొనటం, అవగుణాలను చూచి కూడ మౌనం వహించడం అనే సౌజన్యం ఎంతో మందికి అనుభూతమయిన విషయం సాధారణంగా పాండిత్య కవితాశక్తి ఉన్నవారు గ్రంథరచన వరకే పరిమితమై ఉంటారు వారి గ్రంథాలు చదివినవారికే వారు ఉపయోగపడుతారు. ఆసక్తిఉన్నవారే అపుస్తకాలను చదువుతారు. కాని ఉత్తమ సాహిత్యాన్ని జనం దగ్గరకు తీసుకువెళ్ళడం; జనహృదయాలనుసాహిత్యంవైపు ఆకర్షించి వారిని సాహిత్యారాధకులుగా చేయటం కొద్దిమంది మాత్రమే చేయగలుగుతారు ఈశతాబారంభంలో తిరుపతి వేంకటకవులు తమ కవితా యాత్రల ద్వారాను, అవధాన నిర్వహణల ద్వారాను ఆపని చేశారు మరి తిరుపతిశాస్త్రి గారి వంశీయులయిన అవధానిగారు ఈ యుగంలో ప్రచార సాధనమయిన ఉపన్యాసకళను సమర్ధవంతంగా వినియోగించి సాహితీ వాతావరణాన్ని సృష్టించారు. హైదరాబాదు వచ్చిన దాదిగా తెలంగాణా ప్రాంతంలో ఆయా సందర్భాలలో పర్యటించి వారిచ్చిన ఉపన్యాసాలు ఎంతో మందిని తెలుగు భాష, సాహిత్యం, పరిశోధన, గ్రంధరచన - ప్రచురణ వైపు ఉత్ప్రేరితుల్ని చేశాయన్నది జగమెరిగిన సత్యం. యువభారతి నిర్వహించిన సభలలో వారి ఉపన్యాసాలకు ప్రజలు తిరునాళ్ళకు వలెనే తరలివెళ్ళడం ఇప్పటికి మనస్సులలో మెదులుతున్న దృశ్యం. తెలుగు సాహిత్యంలో యువతరానికి చెందిన వారనేకులు వారిని తమ గురువుగా భావిస్తారు

—సంపాదకీయం
'స్రవంతి'

## 'సార్క్' వర్ధిల్లాలి

దక్షిణ ఆసియా ప్రాంతీయ సహకార సంఘ ద్వితీయ శిఖరాగ్రసమావేశాలు ముగిసాయి ద్వితీయ సంవత్సరానికి అధ్యక్షులుగా భారతదేశాన్ని ఎన్నుకొన్నారు. ఖాట్మండులో సార్క్ సచివాలయాన్ని ఏర్పరచాలనీ, ప్రధాన కార్యదర్శి పదవిని సంవత్సరానికొక దేశానికి చెందిన వ్యక్తి నిర్వహించాలనీ నిర్ణయించారు. ఈనిర్ణయాలన్నీ అందరూ ఆహ్వానించేవే వాస్తవానికి దక్షిణ ఆసియా ప్రాంతీయ సహకార సంఘ సభ్యులందరూ ఒకే సాంస్కృతిక వారసత్వాన్ని అనుభవిస్తున్నవారే. పాకిస్థాన్, భారతదేశం, బంగ్లాదేశ్ నలభై సంవత్సరాల క్రితం ఒకటే దేశం. నేపాల్, భూటాన్ పేరుకు వేరే దేశాలు కాని భారతదేశంతో సాంస్కృతికంగా విడదీయరానివే. శ్రీలంక, మాల్దీవులు కూడ అనేక విధాలుగా భారతదేశంతో సంబంధ బాంధవ్యాలను కలిగి ఉన్నవే, కాని మన దురదృష్టం కొద్దీ వీటి మధ్య స్వార్థరాజకీయాలు చోటు చేసుకుని విభేదాలు పెరిగాయి. ఈ దేశాలు ఒక దానితో మరొకటి అర్థంపర్థం లేకుండా వ్యవహరించసాగాయి. తత్ఫలితంగా ఒక్కటీ ముందుకు వెళ్ళలేకపోయాయి, మొత్తంమీద ఈ విషయాన్ని గ్రహించి ప్రాంతీయ సహకార సంఘాన్ని ప్రారంభించారు. మొదట్లో ఈ సహకారాన్ని కొన్ని రంగాలకే పరిమితం చేసారు. అయితే భారతదేశం మాత్రం వాణిజ్యం, పరిశ్రమలు, ఇంధనం మొదలైన రంగాలకు కూడ సహకారాన్ని వ్యాప్తి చేయాలని ప్రతిపాదన వచ్చింది మొదట్లో ఎక్కువ దేశాలు దీనికి అంగీకరించకపోయినా, ఈనాడు పాకిస్తాన్ తప్ప మిగిలిన దేశాలు అందుకు అంగీకరిస్తున్నాయి

— సంపాదకీయం
'గృతి'

## పండిట్‌జీ

పండిట్‌జీ తన జీవితకాలంలో ఎక్కువగా శాంతి కోసం కృషి చేశారు. 1955లో చైనా ప్రధాని చౌఎన్‌లైతో కలసి ప్రకటించిన పంచశీల ప్రపంచ శాంతి పరిరక్షణ కృషికి అత్యున్నతమైన మలుపు నాటి నెహ్రూ ప్రయత్నంతో నెలకొల్పబడిన అలీన రాజ్యాల సదస్సు, పిలుపు నిచ్చిన అలీనోద్యమం నేడు శాఖోపశాఖలుగా విస్తరించి ప్రపంచంలో ఐక్యరాజ్య సమితి తర్వాత అంతటి చారిత్రక ప్రాధాన్యత గలమరో ఉద్యమంగా రూపుదాల్చింది. నాడు ఆయన వెలువరించిన శాంతి సందేశం, నేడు ఐక్యరాజ్య సమితి ఊపిరి. 1947 మొదలు 1964 వరకు భారత ప్రధానిగా ఆయన దేశానికి చేసిన సేవలు చిరస్మరణీయాలు. దేశంలో నేడు గల భారీ పరిశ్రమలు జలవిద్యుత్తు ప్రాజెక్టులు ఆయనకృషికి నిదర్శనాలు.

— సంపాదకీయం
'ఏలూరు టైమ్స్'

# మానవ ప్రగతి

తాటిచెట్టుపై మానవుడు విజయం సాధించాడు ప్రకృతి ప్రసాదించిన ఈ ఆకాశహర్మ్యాలపైకిమనిషిఎక్కేందుకు ఇంతవరకూ చాలా శ్రమపడేవాడు కాళ్లను గట్టిగాపట్టి వుంచేందుకు చుట్టూరా ఒక గుడతో కట్టుకుని, తన కండ బలంతో వీటిపైకి కొంచెం కొంచెంగా ఎక్కేవాడు తాటి మీదకు చేతులు, కాళ్లు వుపయోగించి ఎక్కడం, దిగడం చూస్తే ఆదిమానవులు గుర్తుకు వస్తారు అయితే ఇప్పుడు తాటిచెట్టు ఎక్కేందుకు ఒక యంత్రం తయారవడంతో, కష్టతరమైన, ప్రమాదకరమైన ఈ చెట్టు ఎక్కడంలో గల శ్రమ, అలసట తొలగినట్లే తాటిచెట్టు ఎక్కేందుకు వుపయోగించే ఈ యంత్రం రూపొందించిన ఘనత తమిళనాడులోని కొలప్పలూరుకు చెందిన పట్టభద్రుడు దేవరాజ్‌కు దక్కింది. అతను తయారు చేసిన ఈ యంత్ర పరికరం ఎక్కడికైనా తీసుకు వెళ్లేందుకు వీలుగా వుంటుంది. ఉక్కు ట్యూబులు, గిలకలతోసూ ఇది తయారవుతుంది. దీని ధర ఒక్కొక్కటి 500 రూపాయలు; బరువు కేవలం 9 5 కిలోలు. కొబ్బరి చెట్లు, తాటిచెట్లూ, పోకచెట్లూ ఈ యంత్ర సహాయంతో సులభంగా ఎక్కయవచ్చు పైకి ఎక్కి క్రిందికి దిగేందుకు దీనిని చేత్తో ఉపయోగించాలి ఏమాత్రం శ్రమపడ నక్కర లేకుండా వృద్ధులు కూడా ఈ యంత్రాన్ని వాడవచ్చు పైనుంచి క్రిందికి పడిపోవటం, చేతులు, ఛాతీ ఒరుసుకు పోవటం వంటి ప్రమాదాలు ఏమీ దీనివల్ల జరుగవు. ఈ యంత్రాన్ని చెట్టు బోదెకు చుట్టూరా త్రిప్పవచ్చు.

## సౌరశక్తితో

ఇండోనీసియాలో 2,500 కిలోమీటర్ల సముద్ర ప్రాంతంలోని వివిధ ద్వీపాలలో గల వేలాదిమంది విద్యార్థులకు యూనివర్శిటీ వనరులను మరింత చేరువ చేసేందుకై ఒక నూతన ఉపగ్రహ కమ్యూనికేషన్ల వ్యవస్థను వినియోగిస్తున్నారు. నిర్వహణలోని ఈ వ్యవస్థ – వర్ధమాన దేశాలలోని మారుమూల ప్రాంతాలలో చిన్నచిన్న ఎర్త్ స్టేషన్‌లకు సౌరశక్తి వ్యవస్థల వల్ల చేకూరే ఆచరణాత్మక ప్రయోజనాలను ప్రతిబింబించేందుకు ఉద్దే

శించిన పథకంలో ఒక భాగం. ఈ ఎర్త్ స్టేషన్‌లోని సౌరశక్తి వ్యవస్థను 'ఫొటోవోల్టాయిక్' వ్యవస్థ అని కూడా అంటారు (ఫొటోవోల్టాయిక్ సెల్స్ సూర్యరశ్మిని నేరుగా విద్యుచ్ఛక్తిగా మార్చుతాయి.) ఇండోనేసియాలోని సులవేసి ద్వీపంపైన ఇటీవల నెలకొల్పిన ఒక ఎర్త్ స్టేషన్ జకార్తాకు, యూనివర్సిటీకి చెందిన 11 వేర్వేరు ప్రాంతాలకు మధ్య ఉపగ్రహం ద్వారా కమ్యూనికేషన్ సంబంధాన్ని నెలకొల్పింది. ఈ నూతన కమ్యూనికేషన్ల పద్ధతివల్ల ఆ ప్రాంతమంతటా గల వేలాదిమంది విద్యార్థులకు లైబ్రరీ, పరిశోధన, ఇతర వనరులు విస్తృతంగా అందుబాటులోకి వచ్చాయి

.. ఇలా వుండగా, ఈ నూతన కమ్యూనికేషన్ల వ్యవస్థకు మూలమైన ఎర్త్ స్టేషన్‌కు అవసరమైన శక్తి నిచ్చే ఫొటోవోల్టాయిక్ సిస్టమ్‌ను (సౌరశక్తి వ్యవస్థ) కాలిఫోర్నియాలోని లాంబీచ్‌కి చెందిన హ్యూస్ ఎయిర్‌క్రాఫ్ట్ కంపెనీ రూపొందించింది. ఈ సౌరశక్తి వ్యవస్థ 20 ఏళ్లకు పైగా పనిచేస్తుంది. ఈ తరహాకు చెందిన 71 సౌరశక్తి వ్యవస్థలు ఇప్పుడు 27 దేశాలలో పనిచేస్తున్నాయి వీటిని అంతర్జాతీయ అభివృద్ధికి ఉద్దేశించిన అమెరికన్ సంస్థ నెలకొల్పింది ఇట్టి సౌరశక్తి వ్యవస్థలవల్ల కొన్ని చోట్ల ఒక్కో గ్రామమంతటికీ-నీటి పంపులు, లైట్లు, పాఠశాలలు, గ్రామీణ ఆస్పత్రులు పనిచేసేందుకు అవసరమైన విద్యుచ్ఛక్తి లభిస్తున్నది.

## వజ్రాల విషయం

వజ్రాలు (డైమండ్స్) విషయంలో మనదేశం ఆదినుండి అగ్రస్థానంలోనే ఉంది నిజానికి తొలుతగా వజ్రాలను కనుగొన్న దేశం మన భారతదేశమే. అలాగే వజ్రాలను కోయడం, ఆభరణాలలో ఇమిడేవిధంగా వాటిని విభిన్న ఆకృతులలోనికి చెక్కడం వంటి నగిషీ పనులన్నీ కూడా మొదటగా మనదేశంలోనే మొదలయ్యాయి. ఇప్పటికీ వజ్రాల చెక్కడాల విషయంలో ప్రపంచ రాజ్యాలన్నింటిలోకి మనదేశమే అగ్రగామిగా ఉంది. ప్రస్తుతం మనదేశంలో ఈ పరిశ్రమలో దాదాపు 5 లక్షల మందికి పైగా పనిచేస్తున్నారు వారిలో 3 లక్షల 50 వేల మందికి పైగా వృత్తి కళాకారులున్నారు. ఇంతటి అధిక సంఖ్యలో వజ్రాల పరిశ్రమను నిర్వహిస్తున్న దేశం ప్రపంచంలో వేరొకటి లేదనుట అతిశయోక్తి కాదు సాంప్రదాయక పద్ధతులలో ఈ పరిశ్రమను నిర్వహిస్తున్న యూనిట్లు దాదాపు 22 వేలదాకా ఉన్నాయి. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని, అత్యాధునిక పరికరాలను ఉపయోగించుకొంటూ ఈ పరిశ్రమను నడుపుతున్న యూనిట్లు కూడా 25 కు పైనే ఉన్నాయి ఇవన్నీ గుజరాత్, మహారాష్ట్ర, కేరళ, కర్ణాటక, గోవాలలో ఉన్నాయి. 'డైమండ్ సిటీ'గా పేర్గాంచిన సూరత్ నగరం (గుజరాత్) ఈ వజ్ర పరిశ్రమకు పెట్టింది పేరు.

ఈ నగరంలో లెక్కకు మిక్కిలిగా డైమండ్ యూనిట్లు ఉన్నాయి ఈ వృత్తిపై ఆధారపడి జీవించేవారి సంఖ్య కూడా ఎక్కువే

మనదేశంలో సాలీనా 3 కోట్ల కేరెట్ల ముడి డైమండ్‌కు గిరాకీ ఉంటుంది అయితే స్థానికంగా లభ్యమయ్యేది 20 వేల కేరెట్లు మాత్రమే కనుకనే మనం అతిగా దిగుమతులపై ఆధారపడవలసి వస్తుంది అమెరికా సంయుక్త రాష్ట్రాలు, ఆస్ట్రేలియా, థాయిలాండ్, జింబాబ్వే మొదలైన దేశాలలో నీలాలు, కెంపులు దొరుకుతున్నాయి కాగా రత్నాలు తదితర విలువైన రాళ్లు మాత్రం బర్మా, శ్రీలంక, థాయిలాండ్, ఇండియాలలో మాత్రమే లభిస్తున్నాయి

## విసిఆర్ పార్టీ

ఒక మహిళ తన ఇంట్లో టెలివిజన్ సెట్ లేదని చెప్పినట్టు ఇటీవల న్యూజెర్సీలోని ఒక పత్రికలో వార్త ప్రచురించారు. ఇకముందు టి వి. కొనుక్కోవాలనే ఆలోచన తమ కుటుంబానికి లేదని కూడా ఆమె తెలియజేసినట్లు ఆ పత్రికలో రాశారు. ఈ వార్త అమెరికాలో పలువురికి దిగ్భ్రాంతి కలిగించింది. ఎందుకంటే టెలివిజన్ అనేది అమెరికనుల జీవితంలో ఒక భాగం. టి.వి. ప్రమేయం లేని జీవితాన్ని ఊహించుకోవడమే వారికి కష్టంగా వుంటుంది. 1939 ఏప్రిల్ 30న న్యూయార్కులో తొలిసారిగా క్రమపద్ధతిలో టెలివిజన్ ప్రసారాలు ప్రారంభమయ్యాయి. 1950 సంవత్సరానికి అమెరికాలోని 9 శాతం గృహాలలో టి వి. సెట్లు నెలకొల్పుకున్నారు 50 శాతానికి టి వి అందుబాటులోకి రావడానికి ఆ తర్వాత కేవలం మూడేళ్ల కాలం మాత్రమే పట్టింది 1960 నాటికి అమెరికాలో 87శాతం గృహాలలో టెలివిజన్ చోటుచేసుకుంది ఇప్పుడు అమెరికాలో 98శాతం గృహాలలో టి వి సెట్లు (కనీసం ఇంటికొక్కటైనా) వున్నాయి. అమెరికాలో టెలివిజన్ వయసు సుమారు 40 ఏళ్లు మాత్రమే అయినప్పటికీ అది ఇప్పటికే పెక్కు భారీ సాంకేతిక మార్పులను చవిచూసింది. కలర్ టి వి, కేబుల్ టి వి అందులో ప్రధానమైనవి. కాగా, వీడియో కాసెట్ల వల్ల అమెరికన్ టి వి మరొక తాజా పరిణామాన్ని చవిచూస్తున్నది అమెరికాలో ఇప్పుడు దాదాపు 20 శాతం గృహాలలో వీడియో కాసెట్ రికార్డర్లు — వి.సి ఆర్‌లు వున్నట్టు ఎలెక్ట్రానిక్ పరిశ్రమల సంఘం అంచనా అమెరికనులు తమ ఖాళీసమయాన్ని గడిపే పద్ధతులను వీడియో కాసెట్లు పూర్తిగా మార్చివేస్తున్నాయి శనివారం రాత్రి సినిమాలకు వెళ్లడానికి బదులు పెక్కు అమెరికన్ కుటుంబాలు ఇప్పుడు వీడియో కాసెటను అద్దెకు తీసుకుని ఇంటివద్దనే చలనచిత్రాలు చూస్తూ గడుపుతున్నారు. 'విసిఆర్ - పార్టీ' అనే పేరుతో అమెరికాలో ఇప్పుడొక

నూతన సాంఘిక సంప్రదాయం కూడా మొదలైంది. ఇందులో - ఒకరు ఏ ఫుట్‌బాల్ ఆటనో, చలనచిత్రాన్నో రికార్డు చేసి ఆ తర్వాత మిత్రుల్ని తమ ఇంటికి ఆహ్వానిస్తారు. అంతాకలసి విందు ఆరగిస్తూ, విసి ఆర్ పార్టీ చేసుకుంటారు ఇలా వుండగా డైరెక్టు బ్రాడ్‌కాస్ట్ శాటిలైట్ అనే కొత్త అద్భుతం గురించి అమెరికాలోని టివి ప్రేక్షకులు ఇప్పుడు చర్చించు కుంటున్నారు దీనివల్ల న్యూయార్కు, లేదా హాలివుడ్‌లోని స్టూడియోనుంచి ఒక ప్రసారం ఉపగ్రహానికి చేరి అక్కడ నుంచి సరాసరి అమెరికాలోని ఏ ఇంటిలోని టి వి. సెట్ కైనాసరే అందుతుంది. ఈ ప్రక్రియ పెద్ద బ్రాడ్‌కాస్టింగ్ స్టేషన్లతోగాని, లేదా కేబుల్స్‌తోగాని అవసరమే వుండదు.

మనకు తెలియని వారిని నమ్మబుద్ధవుతుంది - ఎందుకనగా వారెప్పుడూ మనని మోసం చేయలేదు గనుక!

—సామ్యుల్ జాన్సన్

ఉద్యోగుల వల్ల జరిగే నష్టాన్ని నివారించేందుకు వారి సంఖ్య తగ్గించుకుంటూరాగా, నాలుగేళ్ళ తర్వాత తెలిసిందేమిటంటే, మరొక పన్నెండు వేలు పెరిగిందని!

—లెనిన్

# డైరీ

## 1986 డిసెంబరు 1

హోరున వర్షం పడుతున్నా, పొట్టి శ్రీరాములు హాలులోని గురజాడవర్ధంతి సభకు ('అరసం' మద్రాసు శాఖ) బయలుదేరాను నవంబరు 30 వర్ధంతి కాని, కారణాంతరాల వల్ల యివ్వాళ కావలసిన వారిద్దరు — సెట్టి ఈశ్వరరావు, సరోజినీ ప్రేమ్‌చంద్ — ఎంతో శ్రద్ధ లీసుకు తయారు చేసిన పేపర్లు చదువుతున్నారు నేను లోపల కాలు పెట్టగానే 'హమ్మయ్య - టు. డిజిట్స్ అయింది, యిక ప్రారంభిద్దాం' అన్నారు కార్యదర్శి మల్లిక్ అంతదాకా వక్తలతో కలిపి తొమ్మండుగురు వున్నారక్కడ — నాతో పది మంది అయారు ఇలాటి సమావేశాలకు కావలసినది సంఖ్య కాదు — సాహిత్యాభిమానం. ఇరువురి ప్రసంగ వ్యాసాలూ ఎంతో పరిశీలనాత్మకంగా బావున్నాయి. ఒక గంటసేపు గురజాడ ప్రపంచంలోకి వెళ్లి, మధురవాణీ మీనాక్షీ అని పలకరించి, చిరంజీవి అయిన గిరీశంతో "ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్ స్టార్ — హౌ వుయ్ వండర్ వాట్ యు ఆర్" అన్నాం

. . . . 6

నాలుగు గంటలకి పామ్ గ్రోవ్‌లో 'మయూరి' శుభాకర్ ప్రెస్ మీట్, తప్పకుండా రండి - అన్నారు జగదీష్ బాబు ఫోన్‌లో ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్‌లో శిక్షణ పొందిన యువకళాకారుడు శుభాకర్ శతృఘ్న సిన్హా నాయకునిగా అంబిక, జెవి సోమయాజులు, గిరిబాబు, పి ఆర్ వరలక్ష్మి మున్నగు వారితో, తను ఈ పిక్చర్లో విలన్‌గా, చిత్ర దర్శకునిగా చిత్రాన్ని భారీ ఎత్తున రూపొందిస్తున్నారు సాంకేతిక శిక్షణ ఊహాపోహాలు గల శుభాకర్ తొలి దర్శకత్వ ప్రయత్నం ఫలవంతమవాలని అకాంక్షిస్తున్నాము శతృఘ్న సిన్హా స్వయంగా తెలుగు నేర్చుకుంటున్నాడట వాయిస్ డబ్ చేయకుండా, ఆయన చేతనే చెప్పించవచ్చునేమోనని అనుకుంటున్నారు. పాటలో; వేటూరి, నిర్మాత: మోహన్ ... 'చిన్నికృష్ణుడు' (విజయ సినీక్రియేషన్స్ — జి సుబ్బారావు)', 'పడమటి సంధ్యారాగం' (ప్రవాసాంధ్రచిత్ర — గుమ్మలూరి శాస్త్రి) రెండూ అమెరికాలో జయప్రదంగా ముగించుకొచ్చిన సందర్భంగా దర్శకులు జంధ్యాల,, సవేరా కాన్ఫరెన్స్ హాలులో పత్రికా మిత్రులని కలుసుకున్నారు — ప్రెస్ మీట్ అనంతరం డిన్నర్ ... అమెరికాలో షూటింగ్ చేస్తున్నప్పుడు కలిగిన అనుభవాలు, టైముని వారు ఎంతో పొదుపుగా వాడుకొనే పద్ధతి, డ్రయివర్లు దొరకడంలోని సాధక

బాధకాలు, తమ బృందంలోని వారి కెటువంటి యిబ్బంది లేని భోజన సదుపాయం, క్లయిమేట్ మార్పు తప్ప అంతా మనవాళ్లే అయివుండటం — యిటువంటి విషయాలు ఎంతో ఆసక్తి జనకంగా చెప్పారు జంధ్యాల .. డాక్టర్ సుజాత సమర్పిస్తున్న 'చిన్నికృష్ణుడు'లో రమేష్, కుష్బు, శరత్‌బాబు, భారతి, వీరభద్రరావు, శ్రీలక్ష్మి, విజయభాను, మిస్ ఆర్లిన్, పియల్ నారాయణ, వైజి మహేంద్రన్, డాక్టర్ ఇందిర, శేషగిరిరావు, భూషణరావు పాల్గొంటున్నారు, బర్మన్ సంగీతం, దివాకర్ కెమెరా. పాటలు వేటూరి, మాటలు జంధ్యాల, కథ భమిడిపాటి రాధాకృష్ణ. నటనే నా దీపం, కళలే నా రూపం-అనే మిమిక్రీ కింగ్ కథ యిది. మిమిక్రీ గనక కుప్పతిప్పలుగా హాస్యం ఉంటుంది తలిదండ్రులు విస్తృతావకాశాల కోసం అమెరికా వెళ్తారు; అక్కడ సెటిలవుతారు; పిల్లలు పుడతారు; ముఖ్యంగా ఆడపిల్లల పెళ్లి, అమెరికాలోని తెలుగువారికి ఒక పెద్ద సమస్యగా పరిణమించింది. అటువంటి యితివృత్తం తీసుకున్నారు జంధ్యాల. ఇందులో విజయశాంతి, గుమ్మలూరి శాస్త్రి, మీర్ అబ్దుల్లా, శివమణి, శేషగిరిరావు, విజయ్, బిందు, అనిత, ధీరజ్, టామ్, జొనాథన్, ఆశాజ్యోతి, సుధ, ఎలిజబెత్ జాన్‌జిక్, గాల్‌మాన్, బెంజ్, రోహిణి, అజయ్ మున్నగువారున్నారు సమర్పణ: జి సుబ్బారావు. 'ముద్దుగారె యశోద ముంగిట ముత్యము వీడు' (అన్నమాచార్య) తో బాటు గుండెలో గుబ గుబ కళ్లల్లో తహ తహ — లైఫ్ ఈస్ షాబీ వితౌట్ యు బేబీ, పడమటి సంధ్యారాగాల పారాణి వంటివి (వేటూరి) ఉన్నాయి నేపథ్య గానం. యస్ పి బాలసుబ్రహ్మణ్యం, జానకి, శైలజ, 'చిన్నికృష్ణుడు' లో ఆషా భాన్‌సే, ఆలీషాల కంఠం కూడా వినిపిస్తుంది. రత్నమాణిక్యాల్లాటి రెండు చిత్రాలూ తొందరలోనే విడుదల కానున్నాయి పిఆర్ఒ. అర్జున రావు

. . . . . 8

'సేవ' అనగా భారతీయ భాషలలో ఆ పన్నులకు సేవ చేయడమని అర్థం అయితే ఈ 'సేవ'లో V కి బదులు W వుంది అనగా సెల్ఫ్ ఎంప్లాయిడ్ వుమెన్స్ అసోసియేషన్ (Sewa - Self Employed Women's Association). అహమ్మదాబాద్‌లోని టెక్స్‌టైల్ లేబర్ అసోసియేషన్ (Textile Labour Association, Ahmedabad) పేరు బడ్డ కార్మిక సంస్థ 1980లో ఆ సంస నారీ విభాగంలోని కొందరు స్త్రీలు, మాతృ సంఘం నుంచి విడిపోయి, ఇలా భట్ నాయకత్వాన (ఇప్పుడామె పద్మ భూషణ్ 1986, పార్లమెంట్ సభ్యురాలు, 1977 మాగ్సె అవార్డ్ గ్రహీత) 1972 నుంచి నిర్వహింపబడుతున్న 'సేవ'లో చేరిపోయారు. 'సేవా'కు అయిదు ప్రధాన విభాగాలు వున్నాయి. 1) సహకార బాంకు; 2) ఆర్థికాభివృద్ధి - శిక్షణశాఖ; 3) సామూ

హిక పరిరక్షణ; 4) గ్రామీణశాఖ, 5) సాంఘిక భద్రత, సమాజ న్యాయము, శిశు సంరక్షణ 'సేవా' లోని సభ్యత్వ సంఖ్య 26 వేలు 'ఊయల నూపే చేతులు ప్రపంచాన్ని పాలిస్తాయనే' ఆ మాట కవి సమయమే తప్ప, నిత్య జీవితంలో స్త్రీలకు జరిగే దారుణమైన అన్యాయాలని నిస్సహాయంగా చూస్తున్నాము స్త్రీల హక్కులు కాగితాల మీద మాత్రమే వున్నాయి-వ్యవహార కాండలో లేవు కూరగాయ లమ్ముకొనే స్త్రీ, కాయకష్టంమీద బతికే స్త్రీ, తను సంపాదించినది భద్రపరుచుకోలేని దుస్థితిలో ఉంది. చేతి పనులలోని వారికి, చిన్న వృత్తులలోని వారికి, సేవా సహకార బాంక్ ఆర్థిక సదుపాయం యివ్వడమే గాకుండా, పొదుపు చేసే పద్ధతి కూడా నేర్పుతోంది అలాగే వృత్తి శిక్షణ యిస్తుంది రెండో విభాగం శిక్షణ యివ్వడమే కాదు, వారికి పని కూడా కల్పిస్తుంది. వెదురు బుట్టలల్లే వారికి, మట్టి పాత్రలు చేసేవారికి, అద్దకం పనుల వారికి, వీధుల్లో కిరసనాయిలు అమ్మేవారికి, చేనేత స్త్రీలకు ఇతర పనులువారికి, వూలుతో స్వెట్టర్లు మేజోళ్ల టోపీలు వంటివి అల్లేవారికి, పాల విక్రేతలకు సేవా సహకార బాంకు ఆర్థిక సహాయమందిస్తుంది. బాంకు డిపాజిట్లు ఒక కోటీ 12 లక్షలు; సభ్యత్వ సంఖ్య 22 వేలు. స్త్రీలు తమ సామాజిక స్థానం తెలుసుకొనేందుకు, శ్రమకు తగ్గ ఫలితం పొందేందుకు, ఆర్థికంగా బానిసలు కాకుండా వుండేందుకు, స్వయం ప్రతిపత్తి పొందేందుకు కృషి చేస్తున్న అనుపమ సంస 'సేవా' ఇలా భట్ స్థాపకులుగా అధ్యక్షులుగా జన్మించిన ఈ సంస్థ, సేవా భారత్‌గా (Seva Bharat) ఉత్తరాన ఆరు రాష్ట్రాలకు విస్తరించింది. భగల్పూర్, జమ్‌షెడ్‌పూర్, ఖాదిగ్రామ్, మధుబని, న్యూఢిల్లీ, లక్నో, భోపాల్, ఇండోర్, జబల్‌పూర్, జునాగడ్ - ఈ పట్నాలలో సేవా భారత్ శాఖలు వున్నాయి . ఈ మధ్య సి పి ఆర్ట్ సెంటరులో సేవా భారత్ వర్క్ షాపూ ఎగ్జిబిషనూ జరిగాయి ఉత్తర భారతం నుంచి వచ్చిన వారు ఇక్కడి వారికి తమ హస్త విద్యలు నేర్పారు, అలాగే యిక్కడివారు వారికి నేర్పారు, మాటలతో నిమిత్తం లేని సంజ్ఞల భాషతో ఒకరినుంచి మరొకరు నేర్చుకున్నారు భారత ప్రభుత్వపు హాండీక్రాఫ్ట్స్ శాఖ వారు ఏర్పాటు చేశారిది మూడవ తేదీనాటి ప్రారంభోత్సవ ఆహ్వానం అయిదోతేదీ పోస్టులో అందడం వల్ల వెళ్లలేకపోయాను – మర్నాటి 'హిందూ' లో చదివాను. మా ఇద్దరికీ ఇలా భట్ అంటే ఎంతో గౌరవం; గత పది పన్నెండేళ్లుగా ఆమె గురించి చదువుతున్నాం, వింటున్నాం. ఆమెని రాజ్యసభకు నామినేట్ చేసినపుడు ఆనందించిన లక్షలాది అభిమానులలో మేమూ ఒకరం. ఆమె మద్రాసు వచ్చారు, చూడలేకపోయామే, కలుసుకోలేకపోయామే అని అనిపించింది..... ముగింపు సమావేశానికి ప్రత్యేకంగా యింటికొచ్చి పిలిచారు శకుంతలా శేషాద్రి. క్రాఫ్ట్స్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా


నా పసుపు కుంకుమలతో
చెలగాటమాడిన ఆ కిరాతకుణ్ణి
నేనే కసిదీరా కాల్చి చంపాను
నేను చేసింది తప్పంటారా?
ఓ ప్రేమకథ


(Crafts Council of India) గౌరవ కార్యదర్శిని గీతారామ్, యిటువంటి వర్క్‌షాపులు పరస్పరావగాహనకి ఎంతో దోహదకారి అవుతాయన్నారు అహమ్మదాబాద్ ప్రధాన కార్యాలయం లోని ఆర్థిక విభాగం డైరక్టర్ లలితా కృష్ణస్వామి, 'సేవా' నిర్వహిస్తున్న శాఖల గురించి చెప్పారు ఈ సంస్థకు అంకితమై పోయిన దీక్షావ్రతులలో ఆమె ఒకరు భర్త ఆఫీసుకి, పిల్లలు స్కూలుకి వెళ్లిపోయాక సాయింత్రం దాకా ఏమీ తోచదు అని వాపోయే సంపన్న గృహిణి, ఆమెకు రాస్తే, మీ కాలాన్ని ఎలా ఫలవంతంగా చేసుకోవచ్చో, ప్రతిధ్వను లనిపించే రోజుల్లోకి ఉత్సాహ కాంతులు ఎలా తెప్పించుకోవచ్చో, ఆమె చెబుతారు. అవి పోస్టులోరావు - మీ కార్యాచరణ నుంచి జనిస్తాయి. షాపింగూ సినిమాలే గాక తమ సామాజిక బాధ్యతను తెలుసు కోవాలి సంపన్న స్త్రీలు (Ms Lalita Krishna Swami, Director, Economic & Training Wing, S E W A - Self Employed Women's Association, opp. Victoria Garden, Ellis Bridge, Ahmedabad - 380001)



కామేశ్వరన్ దంపతుల శిష్యురాలు బాలచంద్రా దంపతుల కుమార్తె అయిన ఆరతి, భారతీయ విద్యా భవన్‌లో 30-12-86న యిచ్చిన భరత నాట్య ప్రదర్శన రసజ్ఞులను మెప్పించింది.



సంగీతం : చక్రవర్తి. చంద్రమోహన్, రాజేంద్రప్రసాద్, మారుతీ రావు, వేలు, రావి కొండల రావు, వీరభద్ర రావు, రేఖ, కల్పన, అనురాధ, రమాప్రభ, వై విజయ వున్నారు. 'కమ్మని అందం కవ్విస్తుంటే, గమ్మున ఉండేది ఎట్టా గమ్మ', 'ఎందకమ్మా కోయిలమ్మా', సారాకొట్టు పాట మున్నగునవి చూపించారు.

. . . . 9

పి వి యస్ ఫిలిమ్స్ చంద్రకుమార్, రేలంగి నరసింహారావు దర్శకత్వంలో నిర్మిస్తున్న హాస్యరస చిత్రం 'కాబోయే అల్లుడు' లోని పాటల ప్రదర్శన సురేష్ మహల్‌లో. మాటలు : కాశీ విశ్వనాథ్;

. . . . 10

కోణార్క్ మూవీ క్రియేషన్స్ వారి 'సంకీర్తన' పాటలు పల్లవీలో. ఇళయ రాజా సంగీతంతో, విశ్వనాథ్ శిష్యుడైన గీతా కృష్ణ దర్శకత్వంలో, డాక్టర్ గంగయ్య నిర్మిస్తున్న ఈ చిత్రంలో,

అక్కినేని నాగార్జున కథానాయకుడు. సంగీత సాహిత్య సమ్మేళమైన ప్రణయ కావ్యమిది వే వేల వర్ణాల, దేవీ దుర్గా దేవి, మనసున పలికిన, మనసే పండె నులే, తిల్లానా, ఓంకార వాక్యం, ఈనావ ఏ తీరానికో, వంద రూపాయిల నోటు, కలికి మేనులో, గానం ఆగిపోదులే - యిలా ప్రతి పాట రసభరితమై రాగ సుధ లొలికిస్తోంది పేరును బట్టి, పాట లని బట్టి యిది సంగీత ప్రధాన మగు చిత్రమని అనవచ్చు. బాలసుబ్రహ్మణ్యం, జానకి, వాణీజయరామ్, శైలజల కంఠం నేపథ్యంలో వినిపించగా, ఆ సంగీత ఝరిని సాహిత్యంతో నింపిన వారు : నారాయణరెడ్డి, ఆత్రేయ, సీతా రామ శాస్త్రి. 'వంద రూపాయల నోటు' పాట, ఆ బాక్‌గ్రవుండూ కావ్య గౌరవ వాన్ని దెబ్బ తీస్తున్నాయి ; ప్రేక్షక జన రంజనగా భావించి వుండవచ్చు నిర్మా తలు.... ప్రొజక్షన్ తర్వాత చిత్రవిశే షాల గురించి చిన్న సభ....

. . . . . 12

అరవైలలో ప్రొఫెసర్ ఆదిలక్ష్మి సోవియట్ యూనియన్‌లోని లెనిన్ గ్రాడ్ యూనివర్సిటీలో తెలుగు తమిళ శాఖలు నిర్వహించటానికి వెళ్లారు - ప్రఖ్యాత జర్నలిస్ట్ డి ఆంజనేయులు సతీమణి ఆమె. భార్యాభర్త లిరువురూ పాశ్చాత్యఖండంలో పెక్కు పర్యట నలు జరిపారు ఆదిలక్ష్మి మాస్కో లేఖలు మాలతీ చందూర్ 'ప్రమదా వనం'లో వచ్చాయి. నెల్లూరు దాటి ఎరుగని ఒక తెలుగు వనిత, మొదట్లో తల్లితోను, ఆ తర్వాత ఒంటరిగాను, మాస్కో లెనిన్ గ్రాడ్‌లు వెళ్లి, అక్కడి విద్యార్థులకు ఈ దాక్షిణాత్య భాషలు రెండూ (తెలుగు, తమిళం) నేర్పడం ఆరోజుల్లోఎంతో సాహసంగా భావించే వారు రాకపోకల సౌకర్యాలు, రెండు దేశాల మధ్యగల స్నేహ బాంధవ్యం అప్పటికింకా, నేడు వున్నంత గాఢతర మవలేదు డి ఆంజనేయులు యిక్కడ ప్రభుత్వోద్యోగి. అంచేత ఈయన అక్కడికి వెళ్లడమనే ప్రశ్నలేదు. భార్యా భర్త లిరువురూ వస్తూ పోతూ వుండటమే! అటువంటిసాహసికురాలు, ఎంతో స్నేహ పాత్రురాలు అయిన ఆది లక్ష్మి ఆడపిల్లని కని, ఇరవై ఒకటో రోజునకన్ను మూసింది. మాతా శిశుసం రక్షణ విషయంలో అంత వెనకబడి వున్నారా అక్కడ, అనిపించింది మా కప్పట్లో! కొన్ని నెలలతర్వాత ఆ పసి పిల్లని, ఒక సోవియట్ నర్సుతో ఇండి యాకు పంపి, తండ్రికి వొప్పగించారు. ఆ అమ్మాయి యిప్పుడు పెరిగి పెద్ద యింది; ఎమ్ఎ పాసయింది , ఎమ్ ఫిలిల్ చేస్తోంది ; బుద్ధిమంతురాలు జ్ఞానవతి , చక్కటి వక్త, ఎంతో; వొరవగలది, యువజన కార్యక్రమా లలో ఆమె ముందు నుంటుంది ఇంత చిన్నవయసులోనే ఉత్తర దక్షిణ అమెరికాలు, సోవియట్ యూనియన్, యూరోపియన్ దేశాలు, ఆగ్నేయా సియాదేశాలు యువజన ప్రతినిధిగా పర్యటించి వచ్చింది అటువంటి శాంతిశ్రీ, పూనెకు చెందిన నిరంజన్ పండిట్ అనే విద్యాధిక యువకుని యిష్టపడింది ; పెళ్లి చేసుకొంది ; ఈ

సాయంత్రం హోటల్ కాంబీలో వారి వెడ్డింగ్ రిసెప్షన్. ప్రఖ్యాత జర్న లిస్ట్‌గా, ప్రతి సోమవారం 'హిందూ'లో 'you and me'గా పలకరించే డి ఆంజనేయులు మద్రాసులోని మేధావి వర్గానికి సుపరిచితులు ఒక్కతె కూతురు - తండ్రికి తెలిసిన వారం దరూ శాంతిశ్రీకి తెలుసు శ్రేయోభి లాషులూ స్నేహ బాంధవులూ వచ్చి నూతన వధూవరులకు శుభాకాంక్షలు తెలిపారు. సుమధురగాయని ప్రమీల పాడిన పాటలూ, నిండు తనంతో కూడిన రిసెప్షన్, ఆదరంతో యిచ్చిన విందు శాంతిశ్రీ నిరంజన్ పండిట్లకు చల్లటి దీవెనలు.

. . . . . 14

హన్యా విజన్ అనే సంస్థవారు 'రాణి' అనే తెలుగు టి వి. సీరియల్ నాటకాన్ని అండాళ్ విడియో క్రియే షన్స్ ద్వారా తయారు చేస్తున్నారు. చదువు, తెలివి, ప్రగతి శీలక దృక్పథం ఉన్నతాదర్శాలుగల 'రాణి' అనే యువతి - మధ్య తరగతి యువతి - మూఢత్వమూ అజ్ఞానమూ అవిద్య సోమరితనమూ గల కుటుంబంలోని వ్యక్తులని తన మాటల వల్ల, చేతల వల్ల మార్చడం యిందులోని యితి వృత్తం. కుటుంబాన్ని మార్చడం ద్వారానే సంఘాన్ని మార్చ వచ్చునని రచయిత వాసుదేవన్ అభిప్రాయం ఆ ఐడియా చుట్టూ కథనల్లి విడియో చిత్రం తయారు చేస్తున్న వారు మోహనరామ్. కసాయి గుండె, వంటి నాటకాల ద్వారా పేరు తెచ్చు కొన్న రత్నశ్రీ సంభాషణలు సమ కూరుస్తున్నారు ఈ ఉదయం పామ్ గ్రోవ్ పార్టీలో, పిక్చర్లో పాల్గొంటున్న నటీ నటులను పాత్రికేయులకు పరి చయం చేశారు ఎనిమిది నెలల పాటు సెన్సారు వద్ద చిక్కుపడి పోయిన 'ఖైదీ విశ్వరూపం' పిక్చర్‌కి యెట్టకేలకు సర్టిఫికెట్ వచ్చింది; ఆ పిక్చర్లోని పాటలు ఎమ్ ఎమ్ థియే టర్లో (చిత్ర నిర్మాతలు: భుజంగరావు, సుధాకరరెడ్డి). మిత్రులు కృష్ణమూర్తి హైదరాబాదు నుంచి ఫ్లయిట్‌లో వస్తు న్నారు పదీ అయిదుకి లాండింగ్ అంచేత ఎమ్ ఎమ్‌లో పదినిముషాలు కూచోవడమే తప్ప పాటలు చూడగల అవకాశం లేకపోయింది ఏరోడ్రోమ్ నుంచి 'మీనా' కి వచ్చేసరికి కొంచెం ఆలస్యమయింది; పాటల స్క్రీనింగ్ అయిపోయింది. 'సంసారం అది మిన్సా రమ్' (తమిళం) అత్యుత్తమ కుటుంబ గాథా చిత్రం ఇప్పుడది తెలుగులో, ముత్తురామన్ దర్శకత్వంలో, మూల కథకులైన విసు రచనకు గణేష్ పాత్రో తెలుగుమాటలతో, వేటూరి సుందరరామూర్తి పాటలతో ఎవియమ్ నిర్మాత శరవణన్ తీస్తున్నారు 'సంసా రం ఒక చదరంగం' లో సుహాసిని, అరుణ, కల్పన, శరత్‌బాబు, రాజేంద్ర ప్రసాద్, గొల్లపూడి, నూతన్ ప్రసాద్, దిలీప్, హేమసుందర్, అన్నపూర్ణ ఉన్నారు. షావుకార్ జానకి (తమిళం లో మనోరమ) ధరిస్తున్న పాత్ర ప్రేక్షకులని సంభ్ర మాశ్చర్యాలలో

ముంచుతుంది. 'సంసారం ఒక రణరంగం - అనుబంధం ఒక రణ రంగం' - రణరంగమే కాదు గుణపారం కూడా . 'సంసారం ఒక చదరంగం - బెదిరిందా నీ చిరుస్వప్నం, . 'సంసారం ఒక చదరంగం - చీకటిలో అది రవి కిరణం', తమిళంలో అఖండ విజయం పొందిన ఈ చిత్రం, తెలుగులో కూడా సక్సెస్ అవుతుంది - అందుకు సందేహంలేదు శతదినోత్సవ చిత్రాలకు ఎవియమ్ సుప్రసిద్ధం ... శ్రీనివాస్ ఆహూతులకు స్వాగతం తెలిపిన మీదట శరవణన్, ముత్తురామన్, గణేష్‌పాత్రో, రామానాయుడు (నైజామ్ డిస్ట్రిబ్యూషన్), సుహాసిని క్లుప్తంగా ప్రసంగించారు. ఇంటికొచ్చాక 'ఫోంచేస్తున్నడుప్పు, సుహాసిని ఎంత చక్కగా చెప్పిందండీ - ఆ వినయం, ఆ పొందిక మెచ్చుకోదగ్గవి ఆమెని చూస్తే సినిమా స్టార్ అని అనుకోలేము' - అన్నారు కృష్ణమూర్తి... ... సాయింత్రం పామ్‌గ్రోవ్‌లో 'ఆడపడుచు' శత దినోత్సవం అధ్యక్షులు డివియస్ రాజు, తెలుగు చలన చిత్ర పరిశ్రమ భవిష్యత్తు అయోమయంగా వున్నదన్నారు. సభా కార్యక్రమ నిర్వాహకులైన నూతన్ ప్రసాద్ 'చలిచీమలు' కాలం నుంచీ శివకృష్ణతో తనకు గల స్నేహం చెప్పారు పరుచూరి బ్రదర్స్ యిద్దరూ నటించారు ఈ చిత్రంలో. దర్శకులు రాఘవేంద్రరావు మోహన్ గాంధీకి మెమెంటో అందజేశారు. నిర్మాతలు, పంపిణీదారులు, ప్రదర్శకులు యిచ్చిపుచ్చుకోవడాలు, నటీనటులకు సాంకేతిక నిపుణులకు జ్ఞాపిక లందజేయడం - యిదంతా మామూలే! శివకృష్ణ వందన సమర్పణతో శతదినోత్సవసభ ముగిసింది

. . . . 18

రాణీ సీతమ్ హాలులో 'విజ్‌డమ్' వార్షిక పండుగ విజ్‌డమ్ ఇంటర్నేషనల్ మంత్లీ యింగ్లీషులోను, తెలుగులోను వెలువడుతుంది ముఖ్యంగా ఇంగ్లీషు మాసపత్రిక ఎందరో పెద్దలని ఆకట్టుకోగలిగింది. ఈ పత్రికలో సినిమాల గురించి వుండదు; సెక్సూ క్రయిమూ అమడ దూరాన అట్టేపెడుతుంది. మంచి సంగతులు, ఆరోగ్యవంతమగు విషయాలూ మాత్రమే యిందులో ఉంటాయి ఈ సంచిక చదివినవారిని పైసంచిక కూడా చదివించాలనే తాపత్రయంతో వేసే సీరియల్స్ వుండవు కాల్పనిక సాహిత్యం ఉండదు. ప్రతినెలా వీరు లక్ష కాపీలు ముద్రిస్తున్నారూ అంటే, చాలామంది పత్రికలవారికి ఆశ్చర్యంగా ఉంటుంది మంచివాటికీ, మనసుని మంచి మార్గాన పెట్టేవాటికీ పాఠకాదరణ ఎప్పుడూ వుంటుందనేందుకు 'విజ్‌డమ్' విజయమే ప్రత్యక్ష నిదర్శనం. ఇది కుటుంబ సభ్యులందరూ ఒకటై నిర్వహించే కార్య భారం. కెవి గోవింద రావు సంపాదకులు. ఆయన భార్యా, ఇద్దరు కొడుకులు, ఇద్దరు కోడళ్లు వివిధ శాఖలు చూసుకుంటారు; మిగతా స్టాఫ్ చాలామంది ఉన్నారు.

. ఇవ్వాళ పద్మాల్గవ వార్షికోత్సవం గోవిందరావు, ఆహూతులకు స్వాగతం తెలుపగా, ప్రేమా పాండురంగన్ విజ్‌డమ్ (తెలుగు) అయిదవ వార్షిక సంచికను విడుదల చేశారు. అధ్యక్షులు నెడుంజెళియన్, విజ్‌డమ్ (ఇంగ్లీషు) 14వ వార్షిక సంచికను వెలువరించారు ఒకరు సాహిత్య దీప్తులు ప్రసరిస్తే, మరొకరు హాస్య రసోక్తులు పలికారు, లయన్ వరద నారాయణన్, 'హిందూ' సంపాదకులు యన్ రామ్, 'నేత్రవైద్య ప్రవీణ' బిరుదు సత్కారం పొందుతున్న డాక్టర్లు వెంపటి సూర్య నారాయణ, యస్ యస్ బద్రీనాథ్‌లను అభినందిస్తూ వారి అపూర్వ కృషిని ప్రస్తుతించారు. ప్రశంసా పత్రమూ, రజత నేత్రమూ, ఇరువురు వైద్యనిపుణులకు సమర్పించింది విజ్‌డమ్ సంస్థ ప్రతీ సంవత్సరం యిచ్చే బెస్ట్స్ అవార్డులు నలభై ఏభై మందికి యిచ్చారు — ఉత్తమ ఆటో డ్రయివరు, ఉత్తమ కానిస్టేబుల్, ఉత్తమ కండక్టరు వంటి వారు కూడా ఈ లిస్టులో ఉన్నారు. శరత్ బాబు సభా కార్యక్రమం నిర్వహించగా, మధుమోహనరావు వందన సమర్పణ గావించారు

. . . . . 18

'బ్రహ్మ కడిగిన పాదము'తో అన్నమాచార్య కృతులు గానం చేయడం మొదలుపెట్టారు శోభారాజు, - మద్రాసు రసిక రంజని సభలో, సెయింట్ మ్యుజిషియన్స్ గురించి పరిచయ వాక్యాలే గాకుండా, ప్రతి కృతిలోని భావార్థమూ, తెలుగు తెలి



అన్నమాచార్య శృంగారభక్తి పదాలు శోభారాజు కంఠంలో గాన సుధ లొలికించాయి రసిక రంజనీ సభలో (18-12-86). అన్నమయ్యకంకితమైన గాయనీమణి శోభారాజు

యని వారి కోసమని వివరణతో చెప్పారు ఎయస్ మూర్తి శోభారాజు గాత్రంలోని మాధుర్యం, భక్తి రసంతో కలిసిపోయి, మన ముందు ఒక అలౌకికానంద జగతిని సాక్షాత్కరింపజేస్తుంది. ఆమె పొందే తన్మయత్వమే మననీ అవహిస్తుంది. చివర వరకు వినాలని వుందిగాని, మూడు కృతుల యాక తప్పనిసరిగా కదల వలసి వచ్చింది. ఆరయేటప్పటికి యింటి దగ్గిర వుండాలి — ఆరున్నరకి యిద్దరం కలిసి ఫ్రెండ్స్ింటికి వెళ్లాలి.

. . . . 20

డి కామేశ్వరీ దంపతుల కోసం (నరసింహం), రాధా శివస్వామిలు మహాబలిపురం పిక్‌నిక్ ఏర్పాటు

చేశారు. నిన్న మధ్యాహ్నం చెప్పారు రాధ ఫోనులో, ఎనిమిదిన్నరకి వాన్ మీ యింటి ముందు వుంటుంది, యిద్దరూ మెట్లు దిగివచ్చి కూచోవడమే' – అన్నారు శ్రీమతి అనుమతితో 'ఒకె' చెప్పాను మొత్తం పదిమంది పైన చెప్పిన రెండు జంటలు గాక మేమిద్దరం, సుందరీ హనుమంతరావులు, హేమా రామేశం, ఆమె కోడలు ప్రీతి (రామేశం నిన్న వుదయమే అబుదాబి వెళ్లారు – జనవరి ఏడో తేదీన గాని రారు) తమిళనాడు టూరిస్ట్ గెస్ట్ హవుజ్‌లో శివస్వామి ముందే కాటేజ్ బుక్ చేయించి వుండటంచేత, సాయంత్రం మూడు గంటల దాకా, మనది అంటూ ఒకస్థలం ఉంది కబుర్లు, కాలక్షేపం, జోక్సు, సముద్రపు యిసుకలో పచార్లు, నీళ్లలో తడవటం, స్వీట్ నతింగ్స్ చెప్పుకొనే జంటలని చూడటం, అర్జునుని తపస్సు, పాండవుల రథాలు, షోర్‌టెంపులూ ఇరవయ్యో సారో, ఏభయ్యో సారో దర్శించటం – అన్నిటికీ మించి అందరూ హాయిగా నవ్వుతూ తుళ్లుతూ మాట్లాడుకో గలగటం! పదిమందిలో ఏ ఒక్కరం ఈ రోజు మర్చిపోము, మర్చి పోలేము – జ్ఞాపకాల సుగంధ మటువంటిది వస్తూ వస్తూ 'విజిపి'లో కాఫీ తాగుదామనుకున్నాం లోపలికెళ్లాక కాఫీ బిల్లు రెండు వందలైనా లెఖ్ఖ అనిపించేదికాదు గాని, వాన్‌ని గేటు దగ్గర నిలబెట్టి, తల ఒక్కంటికి పదిరూపాయిలనేసరికి అదేదో అసందర్భములా తోచింది అడయారు వచ్చాక కాఫీ తాగాం మొత్తం మీద రోజంతా నవ్వు పువ్వులతో గడిచిపోయింది కార్డ్స్‌లో ప్రీతీ, కామేశ్వరీ గెల్చుకున్నారు

. . . . 21

ఎమ్ మల్లికార్జున రావు దర్శకత్వంలో, నిర్మాతలు ఎమ్వి రామారావు, రామదాసు విజయ పద్మాలయ పిక్చర్స్ బేనరులో నిర్మిస్తున్న 'తండ్రీ కొడుకుల ఛాలెంజ్' పాటల ప్రొజెక్షన్ సురేష్ మహల్‌లో కృష్ణ, రాధ, సుమలత, సత్యనారాయణ, జయంతి, రంగనాధ్, దేవి, గొల్లపూడి, కన్నడప్రభాకర్, అనురాధ, మున్నగువారున్నారు పాటలు వేటూరి సుందర్రామ్మూర్తి, సంగీతం, చక్రవర్తి. నేపథ్య గానం సుశీల, రాజ్ సీతారామ్ 'మాఘమాస మొచ్చాక మంచు వెన్నెలొచ్చాక, ఎవడూరుకుంటాడు ఎదిగినోడు, పాలకంకి చూసి నాక పడుచువాడు', 'నీ ఒంపులు సొంపుల చంపల కెంపులు గంపల కెత్తాలి'— యిలా వేరు వేరు బాణీలలో ఆరు పాటలు వున్నాయి హృదయ రాగమా, రక్త బాంధవ్యమా? - దేనిది గెలుపు అనే సంఘర్షణతో కూడిన యితివృత్తం

. . . . 24

'ఈ చిత్రపరిశ్రమలోకి వచ్చినప్పట్నించి, గత ఇరవైఏళ్లుగా నాకూ పత్రికల వారికీ గల మైత్రి అపూర్వమైనది 'పల్నాటి సింహం' దాకా నా చిత్రాల్లో ఏ ఒక్కటి ఘనవిజయం సాధించలేక పోయినా పాత్రికేయ మిత్రులు నా ప్రయత్నాలని ప్రోత్సహిస్తున్నారు; నాకు అండగా నిలుస్తున్నారు. వారికి నా పట్ల గల ఆదరాభిమానాలకు నేను సర్వదా కృతజ్ఞుణ్ణి ... చిన్న బడ్జెట్ చిత్రమైన 'తలంబ్రాలు'- మా అబ్బాయి తీసినది - మీ అందరి సహకారం వల్ల నూరురోజుల పండుగ వైపుగా నడుస్తోంది దానితర్వాత 'ఓ ప్రేమకథ' రిలీజ్‌చేయాలని! చిన్నబడ్జెట్ చిత్రాలకు వోపెనింగ్‌వుంటేతప్ప, ఈస్లాబ్‌సిస్టమ్‌లో మూడోవారంలోకి నాలుగోవారంలోకి వెళ్ళలేవు ఆ తర్వాత దాని భవిషత్తు నిర్ణయించేది ప్రేక్షకులే! ప్రసిద్ధ తారాగణం గల భారీచిత్రాల కుండే వోపెనింగ్, చిన్నబడ్జెట్ చిత్రాలకు వుండదు. పత్రికా మిత్రులుగా మీరు చేయగలిగిందేమిటంటే చిన్న బడ్జెట్ చిత్రాలకు ప్రోత్సాహమిచ్చి, వాటి వోపెనింగ్సు మెరుగ యేలా చూడటం, నాకు మా సంస్థకు చెందిన విషయం కాదు— పరిశ్రమ యావత్తుకు సంబంధించిన విషయం. మంచి పిక్చర్లు రావాలంటే అదొక్కటే మార్గం'—అన్నారు, కౌముదీ నిర్మాత యమ్మెస్‌రెడ్డి ఆండాళ్ థియేటర్‌లో జరిపిన పత్రికా గోష్ఠిలో .... 'ఓ ప్రేమ కత' పాటలు చూపారు — పాటలన్నీ మల్లెమాలవి. 'వానేంది— వాగేంది వలపు పంటకు, పగలేంది రేయేంది పడుచు జంటకు' - 'ఎండలో నీడలా నీడలో నిదురలా, వలపొచ్చి వాలింది నాగుండెలో, వరదల్లె పొంగింది నీ అండలో' - జీవితం ఒక వరం అందాల బృందావనం, అనుభవం చెరిసగం- అపురూప మా సంగమం' -ఇలా సాహిత్య సుధాచంద్రికలు వెదజల్లే గీతమాలికకు కన్నడ చిత్ర పరిశ్రమతో

ప్రఖ్యాతులైన యమ్ రంగారావు సంగీతం కూర్చారు, బాలసుబ్రమణ్యం, సుశీల పాడారు సర్వోత్తమన బెనర్జీ, రాధిక, జీవిత, గొల్లపూడి,జయమాలిని, జెవిసోమయాజులు, కృష్ణవేణి మున్నగు వారు గల ఈ చిత్రానికి దర్శకులు రాజశ్రీ, పాటలు చిత్రీకరణలో గల వర్ణ వైభవం నేత్రానందదాయకక, మనోల్లాస కారకం ఆ తర్వాత కౌముదీ వారి ప్రత్యేకమైన డిన్నర్

. . . . 26

యార్లగడ్డ వెంకన్న చౌదరి జాతీయ అవార్డ్ (1987), గ్రహీతల పేర్లని తమయింట జరిగిన పత్రికా సమావేశంలో వెల్లడించారు శంభుప్రసాద్ ఈ అవార్డు ఒక లక్ష రూపాయలు నగదు, ఏప్రిల్ 6వ తేదీన బహూకరిస్తారు 1987 అవార్డ్ యిరువురికి చెరిసగంగా యిస్తున్నారు భారత ప్రధానికి సైన్స్ సమాచారశాఖ సలహాదారు పద్మవిభూషణ్ మీనన్‌కు, ఆంధ్ర ముఖ్యమంత్రి యన్ టి రామారావుకు. రిసెప్షన్ కమిటీకి అధ్యక్షులు యల్వి ప్రసాద్; కన్వీనర్ భాను ప్రసాద్. పదిహేనుగురు కమిటీ సభ్యుల లిస్టు యిచ్చారు ఆ లిస్టులో బియస్సార్ కృష్ణ, మిసెస్ శివస్వామి తప్పిస్తే, మిగతా పదముగ్గురూ సినిమా వారే! . ఏమైనా, వెంకన్న చౌదరి జ్ఞాపకార్ధం ప్రతి ఏడూ లక్షరూపాయిల అవార్డు యివ్వడం మెచ్చుకోదగ్గ విషయం. అందుకు శంభుప్రసాద్, వారి కుటుంబమూ అభినందనీయులు,

'కరమున నిత్యదానము ముఖంబున సూనృతవాణి యౌదలం గురుచరణాభివాదన' (భర్తృహరి) అనేవారు స్వర్గీయి వెంకన్నచౌదరి గురించి అటువంటి తండ్రి నాటిన మొక్కను కుమారుడు పెంచి పోషించడం ప్రశంసనీయం

. . . . 28

బిఎ పాసైన ఒక పేదయువకుడు సర్‌రాజాఅన్నామలై చెట్టియారువద్దకు వెళ్లి 'అయ్యా, ఇంపీరియల్ బాంకులో గుమస్తా ఉద్యోగానికి, దయచేసి నాకు సిఫారసులేఖ యివ్వండి' — అని అర్థించాడు. ఎప్పుడు? ఏభైఆరేళ్ల క్రితం. బాంకు ఉద్యోగమెందుకయ్యా, నాదగ్గర చేరు — అన్నారు ఆ ఉదారగుణ చరితుడు. ఆయన చెప్పినట్లే చేరాడు సుబ్రహ్మణ్య అయ్యర్. అప్పటినుంచి ఇప్పటిదాకా మూడుతరాల చెట్టినాడు వంశానికి — అన్నామలై చెట్టియార్, ముత్తయ్ చెట్టియార్, యిప్పుడు రామస్వామి — ఈ సుబ్రహ్మణ్య అయ్యర్ మిత్రుడో, ఉద్యోగో, ఆప్తబంధువో అంతరంగికుడో, సంరక్షకుడో ఏమిటో తెలియని విధంగా కట్టుబడి వున్నాడు — ఇంగ్లీషులో 'లాయల్టీ' అనే మాటకి తెలుగుపదం స్ఫురించడం లేదు. "ఆయనవల్ల మేము బాగుపడ్డామో, మావల్ల ఆయన బాగుపడ్డారో తెలియరాని అనుబంధం మాది. నాకు తండ్రి వంటివారు సుబ్రహ్మణ్య అయ్యర్. కన్నతండ్రి (ముత్తయ్ చెట్టియార్) పెంచిన తండ్రి యిరువురూ వెళ్లి

పోయారు" – అని అన్నామలై యూనివర్సిటీ ఛాన్సలర్ సభాముఖంగా చెప్పారంటే, వైద్య సుబ్రహ్మణ్య అయ్యర్ ఎంత గొప్ప వ్యక్తో ఊహించుకోవచ్చు ఉపరాష్ట్రపతి వెంకట్రామన్, ఆ పుణ్య పురుషుని చిత్రపటం మైలాపూర్ అకాడమీలో ఉంచేందుకు, ఆవిష్కరించారు – నారాయణీ అమ్మాళ్ కళ్యాణ మండపంలో 1953లో రెండవ ఎలిజబెత్ పట్టాభిషేకానికి స్వయంగా హాజరైన ఈ సుబ్రహ్మణ్య అయ్యర్, పారిశ్రామిక రంగంలో చెట్టినాడ్ కుటుంబం విస్తరించేందుకు ఎంతో దోహదం చేశారు. 27 సంవత్సరాలు సాగిన కోర్టుకేసులో వారికి విజయం సాధించి పెట్టారు 1971లో పద్మశ్రీ బిరుదు పొందారు ; అదే సంవత్సరం శృంగేరీ పీఠాదిపతి ఆయనని 'ధర్మాత్మ' అన్నారు, అంతకు రెండేళ్ల క్రితం కంచి కామకోటి పీఠాధిపతి ఆయనని 'దాన చింతామణి' అన్నారు శృంగేరి పీఠాధిపతి మైసూరు మహారాజా సుబ్రహ్మణ్య అయ్యర్ని 'గురుభక్త శిరోమణి' అన్నారు. ఎన్ని దేవాలయాలూ, ఎన్ని సేవా మందిరాలూ ఆయన సహాయ సహకారాలతోను, దాతృత్వంతోను వృద్ధిలోకి వచ్చాయో యిక్కడ లెఖ్ఖ చెప్పట మనవసరం. సంస్కృతం, వేదాధ్యయనం, హిందూమత పునరుద్ధరణ ఆయనకెంతో ప్రీతి పాత్రం. అలాగే సామాజికాభ్యుదయం, పేదలకు వుపకరించే కార్యక్రమాలు ఉచిత వైద్య సదుపాయం - యిలాటివెన్నో మైలాపూర్ అకాడమీ ద్వారా (ఆయన దానికి అధ్యక్షులు) చేయించేవారు వీరరాఘవన్ స్వాగతం, యమ్మెస్

శివస్తోత్రం, సదాశివం చిత్రపటాన్ని లాంఛవ ప్రాయంగా అందుకోవడం, రామస్వామి పాతిక వేలు విరాళ ప్రకటన, తమిళనాడు గవర్నరు ఖురానా సుబ్రహ్మణ్య అయ్యర్ స్మృతికి నివాళ లర్పించడం, ఆ తర్వాత ఉప రాష్ట్రపతి మాట్లాడారు "ఆరో ఏట నుంచి మేమిద్దరం క్లాస్ మేట్సుమి ఒకటా, రెండా డెబ్బయ్యేళ్ల జ్ఞాపకాలు ... విదేశ వస్త్ర దహన మప్పుడు, నేను నా షర్టు వెంటనే తీసి యిచ్చేశాను మంటల్లో వేసేందుకు – పక్కనున్న సుబ్రహ్మణ్య అయ్యర్ యివ్వలేదు కారణం అప్పట్లో అతని కున్నది అదొక్కటే షర్టు నేను నెహ్రూ కుటుంబానికి 'లాయల్టీ'తో – జవహర్ లాల్ నెహ్రూ, ఇందిరాగాంధీ, ఇప్పుడు రాజీవ్ – జీవించాను, చిరకాలమిత్రుడు సుబ్రహ్మణ్య అయ్యర్ చెట్టినాడు కుటుంబానికి 'లాయల్టీ'తో – అన్నామలై చెట్టియార్, ముత్తయ్ చెట్టియార్, రామస్వామి – జీవించాడు. నియమ బద్ధులమై, రుజు వర్తనతో కష్టపడి పైకి వచ్చాము మేమిద్దరం. నిర్విరామ కృషి, నిశ్చల దీక్ష – ఈ రెండే జీవితానికి వెలుగుని, అర్థాన్ని యిస్తాయి. సుబ్రహ్మణ్య అయ్యర్ ది ఫలవంతమగు ధార్మిక జీవితం. అది నేటి యువతకి ఆదర్శప్రాయం కాగలిగితే బావుణ్ణు" – అన్నారు వెంకట్రామన్. మైలాపూర్ అకాడమీ ఛెయిర్మాన్ యన్నీ రాఘవాచారి వందన సమర్పణ గావించారు.

. . . 29

పామ్‌గ్రోవ్ రూఫ్ గార్డెన్‌లో యాక్షన్ కింగ్ అర్జున్ పార్టీ — మూడు రోజుల క్రితమే చూశాము 'మొనగాడు'. వెండితెర చిత్రణకీ అసలు మనిషికీ ఎంతో వ్యత్యాసం వుండటం సర్వ సాధారణం అర్జున్ చాలా నెమ్మదస్తుడు, పొందికగా మాట్లాడే స్వభావం గలవ్యక్తి రచయిత సివి రమణ పాత్రికేయులకు స్వాగతం తెలిపిన మీదట, ఉపన్యాస తదంగం లేకుండా యిష్టాగోష్టి. మెయిన్ టేబుల్ వద్ద నిర్మాత వెంకన్నబాబు, రచయిత రమణ, హీరో అర్జున్ కూచున్నారు. 'పెళ్లెపుడు,?' అన్న ప్రశ్నకు, మా అమ్మగారికి నచ్చిన అమ్మాయిని చేసుకుంటున్నారు అర్జున్. ప్రస్తుతం డజను పిక్చర్లు వున్నాయి. '1986 లో మీరు నటించిన చిత్రాలలో మీకు ఎక్కువగా నచ్చిన పాత్ర ఏది?' — అన్న ప్రశ్నకు 'మన్నెంలో మొనగాడు' అన్నారు '86 ముగిసి '87 లోకి ప్రవేశిస్తున్న సందర్భంగా నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలిపారు.

. . . . 30

గ్రామ్య వికాసం నుంచి సామాజిక న్యాయం ఎలా సాధ్యమో స్వయంగా ప్రయోగాలు చేసి చూపిన త్రిభువనవేప్రసాద్ తివారీ, ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వ ముఖ్య కార్యదర్శిగా రిటైరయాక, రాజకీయాలలో ప్రవేశించి, ప్రస్తుతం పాండుచ్చేరి లెఫ్టినెంట్ గవర్నరు. Boquet of Thoughts seek-

er's Quest వంటివి ఆయన ఉప న్యాసాలలోని అమృత గుళికలు .. మార్గదర్శి చిట్‌ఫండ్ నుంచి 'అన్నదాత' నుంచి 1974 ఆగష్టు ఎనిమిదో తేదిన వైజాగ్ 'ఈనాడు', ఆ తర్వాత హైదరాబాదు, విజయవాడ, తిరుపతి ఎడిషనులు. ప్రియా పికిల్స్ నుంచి ప్రతిఘటన చిత్రం దాకా, గీతావచనం చెప్పకపోయినా గీతా బోధని నిత్య జీవితంలోకి అపూర్వ విజయంతో అను వదించిన కార్యశూరుడు రామోజీరావు ... జగమెరిగిన బ్రాహ్మణునికి జందె మేలా అన్నట్లు పద్నాలుగో ఏటి నాటి స్వప్నాలకు, సాహిత్య సుధతో ప్రాణ ప్రతిష్ట చేసి, సమగ్రాంధ్ర సాహిత్యం నేటి పాఠకులకు అందించిన ఆరుద్ర, పాండిత్యంలో పరిశోధనలో కవితలో కావ్యరస సిదిలో సాటిలేని మేటి. గుండెలు పిండే కవితలతో బాటు, 4500 సినిమాపాటలు రాశారు, ఎన్నో చిత్రాలకు కథలూ సంభాషణలూ సమకూర్చారు. ఆరుద్ర అంటే తెలి యనివారెవరు ? .. ఈ ముగురినీ యల్వీ ఆర్ (LVR Foundation) ఫౌండేషన్ 1987 జనవరి 4వ తేదిన శంకరదాస్ ఆడిటోరియమ్‌లో, జస్టిస్ చల్లా కొండయ్య అధ్యక్షతను, సత్క రిస్తోంది .. స్వయం కృషితో పైకొచ్చిన వ్యాపార దక్షులు యల్వీఆర్: టిటిడి బోర్డు సభ్యులు అన్నదాన పథకానికి పదిలక్షలు విరాళమిచ్చిన మొదటి దాత; మిత్రులు మాన్నింగ్‌కా చేత మరో యిరవై లక్షలు యిప్పించారు. ఆర్జనలో కొంత శాతం అర్తులకు అందజేయాలనే నియమం గల ఉదారవ్యక్తి. యల్వీఆర్ ఛారిటీస్ ఎందరినో ఆదుకుంటోంది మూడు లక్షల యాభైవేల నిధితో ఏర్పడ్డ యల్వీఆర్ ఫౌండేషన్ ప్రతీ సంవత్సరం ముగ్గురు ప్రసిద్ధులకు పదివేలు చొప్పున సత్కారంగా అందజేస్తుంది. ఈ సంవత్సరం ఆ సత్కార్యాన్ని పైన పేర్కొన్న ముగురూ అందుకుంటున్న విషయం తెలిపేందుకు అశోకా హొటల్‌లో పత్రికా సమావేశం జరిపారు యల్ వి రామయ్య ఇంకా ఎన్నో మంచి పనులు చేయాలనే ఆయన ఆకాంక్ష నెరవేరాలని అభిల షిస్తున్నాము . యస్కె కామేశ్వరన్ దంపతుల శిష్యురాలు ఆరతి, భారతీయ విద్యాభవన్‌లో, కపాలీ ఫైన్ ఆర్ట్స్ తరఫున, భరతనాట్య ప్రదర్శన యిచ్చింది. ఆంగికంలోను, లాస్యం లోను చిన్న వయసులోనే కళాభిమాను లని మెప్పించ గల ప్రావీణ్యత పొందింది ఆరతి మహాలక్ష్మి నాట్యా లయంలో శిక్షణ పొందిన ఈ అమ్మాయి, విద్యాధికులూ ఉద్యోగులూ అయిన బాల చంద్రా దంపతుల కుమార్తె. ఉజ్వల భవిష్యత్తుగల ఉదయతార .. ప్రొఫెసర్ లలిత, మాజీ ప్రిన్సిపాల్ సరోజినీదేవి, తమిళనాడు ప్రభుత్వం నుంచి ఉత్తమ అధ్యాపక బహుమతి పొందిన సందర్భాన వెంకటేశ్వరా యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ జి యన్ రెడ్డి ముఖ్యఅతిథిగా, మదరాసు తెలుగు రచయితల సమితి అయిన 'రచన', పొట్టి శ్రీరాములు హాలులో, అభినందన

సభ జరిపింది ప్రొఫెసర్ లలిత స్టూడెంట్‌గా వున్ననాటి విశేషాలు జియన్ రెడ్డి చెప్పగా, గురుత్వమనే మాటకు గల విపులార్థాన్ని వివరించారు చిన్నికృష్ణయ్య పూర్వ ... ర్థినులు తమ అధ్యాపకుల గురించిన జ్ఞాపకాలు తెలిపారు

. . . . . 31

1986 సంవత్సరానికి తమ కార్యాలయంలో వీడ్కోలు చెప్పమన్నారు శ్రీ దేవీ కళాచిత్ర జికె రెడ్డి. శివన్నారాయణలు పరుచూరి బ్రదర్స్ కథని, దర్శకులు రామ్మోహనరావు తెరకెక్కిస్తున్నారు. 'లాయర్ భారతీదేవి' గా ఊర్వశి శారద కళ్యాణ చక్రవర్తి, సుధాకర్‌తో బాటు పరుచూరి బ్రదర్స్, నూతన్ ప్రసాద్, గిరిబాబు మున్నగువారున్నారు కొత్త ముఖాలు కొన్ని పరిచయమవుతున్నాయి నిర్మాతలు పిక్చర్ విశేషాలు తెలిపాక, వెట్‌పార్టీ 'డ్రయ్' వారికి భోజనాలు లోపల ఏర్పాటు చేశారు మా తొమ్మిది మందికి పదార్థాలు సరిగా అందాయో



ఎవరెవరు ? ఏ చిత్రంలోనిది ఆ వేషధారణ ? సరిగా చెప్పగలిగిన మొదటి ఇరువురికీ పదేసి రూపాయిలు బహూకరించగలము. ఎక్కువ మంది చెప్పగలిగినప్పుడు చీట్లువేసి మొదటి ...గికే బహుమతి యివ్వడం జరుగుతుంది. మీ జవాబు కార్డు మీదనే ...యండి. మాకు అందవలసిన చివరి తేది: 10-3-1987.

JAGATI - 2, Kutchery Road, P B 2922, Madras - 600 004

లేదో కనుక్కున్నాక, భోజనానికి కూర్చున్నారు ఊర్వశి శారద పది గంటలకి మేము యిళ్లకి ఒయలు దేరాం - మిగతా పార్టీ ముగిసేసరికి పన్నెండున్నర అయిందట.

## 1987 జనవరి 01

ఏడెనిమిదేళ్లుగా జనవరి ఒకటో తేదీ ఉదయం నవతా కృష్ణంరాజు ఆఫీసులో పూత రేకులతో బ్రేక్‌ఫాస్ట్ ఒక సంప్రదాయమయింది. పత్రికా మిత్రులని కొత్త సంవత్సరం పొద్దుటి వేళ కలుసుకోవటం, ఆయనకు సరదా, సెంటిమెంటూను. ఇంచుమించు అందరూ ఆ ఉదయం పూట అక్కడ సమావేశమై, 'హాపీ న్యూ ఇయర్' చెప్పుకుంటారు ఇవ్వాళ నాతోబాటు సారా డిక్కిని తీసుకు వెళ్లాను. ఆమె యాంత్రోపాలజీలో ఎమ్‌ఏ పాసై, తమిళనాడులో ఫిలిమ్‌కి లోయర్ మిడిల్ క్లాస్ పైగల ప్రభావం ఎటువంటిది? - అనే అంశంపై కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో డాక్టరేట్ చేస్తోంది. అందుకోసమామె సంవత్సరంపైగా మధురైలో ఉంటున్నది. అయితే వేణుగోపాలరావు (అమెరికన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియన్ స్టడీస్) ద్వారా మాకు పరిచయమైనది మూడునెలల క్రితమే! రెండుసార్లు మధురై నుంచి వచ్చింది - ఇది మూడోసారి రేపు సాయంత్రం అమెరికా వెళ్లిపోతుంది బాలాజీ, భారతీరాజా, కమల హాసన్, ముక్తా శ్రీనివాసన్, బాలచందర్, భానుమతి, షావుకార్ జానకి, డివియస్ రాజు, రామానాయుడు యిలా ఎందరివద్దకో ఆమెను, ఆమె థీసిస్‌కి కావల్సిన సమాచారం కోసం తీసుకువెళ్లాను. పిరాపసహాయపనదగు యల్వీ ప్రసాద్‌ని కలుసుకోవడం పడలేదు. ఒకసారి ఈమె వచ్చినప్పుడు ఆయన బొంబయిలో ఉన్నారు, మరొకసారి హైదరాబాదులో ఉన్నారు: ఇవ్వాళ జయప్రదా ఫిలిమ్ సర్క్యూట్ వారి 'రాకీ' చిత్రానికి ప్రారంభోత్సవం - యల్వీ ప్రసాద్ చేస్తున్నారు.... అందుకని నవతా ఆఫీసునుంచి వాహినీకి. . కోడి రామకృష్ణ దర్శకత్వంలో అర్జున్ కెవియమ్‌వారి హీరోగా 'మనవడొస్తున్నాడు' షూటింగు విజయా కలర్ లాబ్‌కి ఎదురుగా వున్నగుడిలో. రూపిని అనే కొత్తమ్మాయి పరిచయమవుతోంది ఈ చిత్రంలో... జయప్రదావారి 'రాకీ'కి దర్శకులు పి చంద్రశేఖర్‌రెడ్డి; జయప్రదతోబాటు ఆమె సోదరులు రాజ్‌బాబు, శ్రీరామ్ కుమార్ (హీరోగా) ఈ చిత్రంలో నటిస్తున్నారు. దీపారాధన, మద్రాసు నగర పోలీసు కమీషనర్ దేవారామ్ చేశారు: యల్వీ ప్రసాద్ క్లాప్ యిచ్చారు; సురేష్‌రెడ్డి కెమెరా స్విచాన్ చేశారు .. సారా డిక్కిని ప్రసాద్‌గారికి పరిచయం చేసి, ఆమె వచ్చిన పని చెప్పాను. అక్కడనుంచి ప్రసాద్ లాబ్‌కి వెళ్లాము. తండ్రీ కొడుకులు (యల్వీ ప్రసాద్ - రమేష్) సారాడిక్కీకి, ఆమె పరిశోధనా సంబంధిత సమాచారం తెలిపారు. ఈ మధ్యనే, ఫిలిమ్ పరిశ్రమ ప్రతినిధిగా

చైనా వెళ్లివచ్చిన రమేష్ (సౌత్ఇండియన్ ఫిలిమ్ ఛాంబర్ అధ్యక్షులు) ప్రసంగవశాన అక్కడి విషయాలు, బెజింగ్‌కీ అమెరికాకు మధ్య రాకపోకలు అధికం గావడం, బెజింగ్‌లో కనిపించే అమెరికన్ పర్యటనకి బృందాలు గురించి చెప్పారు చైనా ప్రస్తావన వచ్చినప్పుడు విక్రమ్‌సెతెపెరు ఉదాహరించడం అలవాటై పోయిందీ మధ్య నాకు 'హెవీస్లీ గేట్' పుస్తకం చదవలేదుగాని ఆయన గురించిన ఆర్టికల్ 'స్పాన్' లో చదివానన్నారు రమేష్ — కొత్త సంవత్సరం మొదటి రోజు - అందరం కలిసి కూచోవాలి భోజనానికి - పన్నెండున్నర లోపున మీరిద్దరూ యిల్లు చేరుకోవాలి అని బయలుదేరబోతున్నప్పుడే ఆర్డరు వేశారు శ్రీమతి పన్నెండుం పావుకే యిల్లు చేరుకున్నాం - నవతా కృష్ణంరాజు పూతరేకుల పాకెట్లతో. ... నాలుగురోజుల క్రితం ఏదో ప్రెస్‌మీట్ అయాక, బయట నిలబడి ముగ్గురు పత్రికామిత్రులతో మాట్లాడుతున్నప్పుడొచ్చింది ఈ విషయం! 'మనకి ఎవరెవరు ఏవే గిఫ్టులు యిస్తున్నారో, మీరు డైరీలో రాయడం కొందరికి యిబ్బందిగా ఉంటోంది' అన్నారు ఒకరు. 'ఏవిధంగా ? మనం పుచ్చుకున్నది పైకి చెప్పడంలో పొరబాటేమున్నది? ఆ చెప్పడం, యిచ్చిన వారికి కృతజ్ఞత తెలుపడం కదా?' - అని ప్రశ్నించాను. 'నిజమే అనుకోండి కాని, ఈ నిర్మాతలూ తారలూ విజయవాడ, హైదరాబాదు వెళ్లినప్పుడు అక్కడి పత్రికా సోదరులు, మద్రాసులో వారే ముఖ్యమా, మేము కాదా అనే ప్రశ్న, వీరిని యిరకాటంలో పెడుతున్నదట. నాతో స్వయంగా అన్నారు యిద్దరు ముగ్గురు. ఈ 'డెలికేట్ మేటర్' మీకు ఎలా చెప్పడమా అని ఆలోచిస్తున్నాం' - అన్నారాయన మిగతాయిద్దరూకూడా అదేఅభిప్రాయం వెలిబుచ్చారు 'సారీ, నాకీ పాయింట్ యిన్నాళ్లూ తట్టనే లేదు' ఇక ముందు పత్రికలో చెప్పను లెటర్ ద్వారా వారికి కృతజ్ఞత తెలియబరుస్తాను'' అన్నాను. మిత్రులూ, హితులూ, మేలు కోరేవారూ మెచ్చేదే నా మార్గం

జనవరి 02

త్రిపురనేనిరామస్వామిశతజయంతి ఉత్సవాలు మద్రాసులో జరిపేందుకు, గుమ్మడి వెంకటేశ్వరావు అధ్యక్షులుగా యమ్మెస్ రెడ్డి, శంభు ప్రసాద్, రమణయ్యరాజు ఉపాధ్యకులుగా, బియస్సార్ కృష్ణ, మల్లిక కన్వీనరులుగా ఒక కమిటీ ఏర్పడింది. జనవరి నెలాఖరున జరిగే ఈ ఫంక్షన్‌లో పార్లమెంటరీ కాంగ్రెస్ పార్టీ డెప్యూటీ లీడర్ యన్‌జి రంగా, వెంకటేశ్వరరావు విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షులు జియన్ రెడ్డి, కళావాచస్పతి జగ్గయ్య మున్నగువారు పాల్గొంటున్నారు. వ్యాసరచన పోటీ వక్తృత్వ పోటీ యిత్యాదులు వున్నాయి ఈ ఉత్సవ వివరాలు తెలిపేందుకు కన్వీనర్లు, పొట్టిశ్రీరాములు హాలులో పత్రికా సమావేశం జరిపారు పెరియార్ రామస్వామిది రాజకీయ కార్యరంగం ; త్రిపురనేని రామస్వామిది కవితా

శంగం ; ఇరువురూ తమ ప్రాంతాల సాటిలేని సంఘ సంస్కర్తలు

. . . . 04

రాజశేఖర్—సుమలత, నరేష్—అరుణ, మురళి—శ్రీకుమారి.. ఇలా మూడు జంటలు. మొదటి నాలుగు పేర్లూ సినీప్రేక్షకులకు చిరపరిచితం. మురళి ఎవరంటే ప్లేబాక్ గాయని కుమారుడు ఛార్టర్ అకవుంటెంట్ అవడానికి బదులు సినీ హీరోలపంక్తిలో చేరాడు, శ్రీకుమారి సవేరా హొటల్లో రిసెప్షనిస్ట్. ఈ పిక్చర్ తీస్తున్న సుధాకర్, కరుణాకర్‌లు, సవేరా మేనేజింగ్ డైరక్టరు ఎవికె రెడ్డి కుమారులు నిర్వహణ : గురుదేవ్, చిత్రంపేరు శ్రుతిలయలు దర్శకులు , కె విశ్వనాథ్ మాటలు · ఆకెళ్ల , పాటలు · సీతారామ శాస్త్రి ; సంగీతం· మహదేవన్. హరిద్వార్ — ఋషీకేశీలలో ఈ సుదర్శన్ సినీ ఎంటర్‌ప్రయిజెస్ వారి షూటింగు, 1986 నవంబరు 24 నుంచి డిసెంబరు 2 వరకు జరిగింది వంద మంది బృందంతో అక్కడికి వెళ్ళారు. మొదలు చెప్పిన మూడూ యువజంటలు. ప్రధాన జంట సత్యనారాయణ, అంజలీదేవి. సంగీతరసాస్వాదనలో, మునకలు వేయించే ఈ చిత్రంలో చక్కటి కథ సంవిధానంతో బాటు పన్నెండు రాశులను స్త్రీకి అన్వయిస్తూ చెప్పె అన్నమాచార్యకీర్తన, నారాయణ తీర్థుల వారి సరికొత్త తరంగం వంటివి వున్నాయి. దర్శకులు విశ్వనాథ్ ఈ మధ్యాహ్నం 'సవేరా' లో, శ్రుతిలయల విశేషాలు పాత్రికేయులకు చెప్పారు.

. . . . 05

'దేవీ శ్రీదేవి'లో భక్తిరస ప్రధానమైన 'నాగదేవత మహాత్మ్యం' లోని పాటల ప్రొజెక్షన్. 'అయిరం కణ్ణు డైయాళ్' తమిళంలో హిట్. శంకర్ నిర్మించిన ఆ చిత్రాన్ని యస్ హుస్సేన్ తెలుగులోకి డబ్ చేశారు అతి ప్రాచీనమైన నాగపూజ ఆధునికులను భయవిభ్రాంతిలో ముంచే విధంగా రూపొందించారు. సహస్ర దయా నేత్రిణిని కీర్తించే ఈ చిత్రంలో కథానాయిక జీవిత పబ్లిక్ రిలేషన్స్ ; అర్జునరావు . తర్వాత, 'సంకెళ్లు' చిత్రంలోని పాటలు చూపించారు అదేథియేటర్‌లో. 'మనకు పోయేందు కేమున్నాయి - సంకెళ్ళు తప్ప', అనే ప్రపంచ కార్మిక ప్రబోధాన్ని ఉత్తేజవంతంగా చిత్రీకరించారు అది పేదల ఆక్రందన - మరొక వైపున కలిగిన వారి ప్రణయ రాజ్య రస కేళి. మూడేళ్ల తర్వాత లక్ష్మి మొదటిసారిగా స్టేజి ఎక్కిందనే విషయం, వాళ్ల బ్రదర్ చెప్పే దాకా నాకు తెలియదు కూచిపూడి ఆర్ట్ అకాడమీ వెంపటి చినసత్యం శిష్యురాలైన లక్ష్మి, కూచిపూడి బృందంతో విదేశాలలో ప్రదర్శనలు యిచ్చి వచ్చింది - నాట్య కళకు అంకితమైన నవ యువతీ లలామ. సంపన్న కుటుంబాలలోని అనేకమంది వనితలకు నాట్యకళ నిత్యజీవనశోభనీ, స్ఫూర్తినీ యిస్తున్నది ఆ కళాసేవలో వారొక దివ్యానుభూతికి అంకితం

కాగలుగుతున్నారు - ఇది సామాజిక సత్యం శ్రీ కృష్ణగాన సభవారి 31 వ ఫెస్టివల్ సందర్భంగా లక్ష్మి ప్రదర్శించిన నాట్యం ఎంతో రమణీయం. 'భామాకలాపం' లోని భావ ప్రకటన, పదచరణ విన్యాసమూ, లాస్యమూ ఎంతో మనోహరంగా ఉన్నాయి. నట్టువాంగం. వెంపటి చినసత్యం.

. . . . 7

మిత్రులు యస్వీయస్ ద్వారా ఆదర్స్ గిల్డ్ సభ్యులైన ఖురానా దంపతులతో పరిచయ మేర్పడింది. చూసిన వేళా విశేషమూ అన్నట్టు, అతి స్వల్ప కాలంలోనే ఎంతో చేరవయారు ఆ దంపతులు. ఆయన ఒ. యన్. జి. సి. లో (ఆయిల్ అండ్ నాచురల్ గాస్ కమీషన్) ఉద్యోగి, ఆమె డెహ్రాడూన్‌లో ఇంగ్లీషు లెక్చరరు. వారి స్వస్థలం కూడా డూనే! ఇరువురు అమ్మాయిలూ యుపి లోనే మెడిసిన్ చదువుతున్నారు ... ఇవ్వాళ ఖురానా, రాజాజీ సెంటినరీ హాలులో, రెండు కథల పుస్తకాలు, ఆదర్స్ గిల్డ్ సభ్యుల కోసం సమీక్షించారు. ఒకటి అంతర్జాతీయ తెలుగు సంస్థ (ఇంటర్నేషనల్ తెలుగు ఇన్‌స్టిట్యూట్), 1985 ఉత్తర అమెరికా తెలుగు సభల సందర్భంగా (TANA - Telugu Association of North America) యమ్వీశాస్త్రి సంపాదకత్వాన వెలువరించిన తెలుగు కథల అంగ్లానువాదం కందుకూరి, కరుణ కుమార్, ముని మాణిక్యం, శ్రీపాద, చలం మున్నగువారివి పది పన్నెండు కథలు. రెండోది: ప్రఖ్యాత తమిళ సాహితీకారులైన నా. పార్థసారథి కథలకు నటరాజన్ ఆంగ్లానువాదం. ప్రాంతీయ భాషల్లోనివి అంగ్లంలోకి వస్తేతప్ప దేశవ్యాప్తం కాలేవనేందుకు ఈనాటి సమీక్షా సమావేశం ఒక ప్రత్యక్ష నిదర్శనం. మద్రాసు చాప్టర్ కన్వీనర్ యస్వీయస్ ఆహూతులకు స్వాగతం తెలిపిన మీదట, ఖురానా తన పరిశీలనా వ్యాసం చదివారు - చాలా బావుంది. అవినాశలింగం 'సేక్రెడ్ టచ్' ('The Sacred Touch'), గురించి మరొక మిత్రులు తమిళంలో ప్రసంగించారు. ('జగతి' - 360 .. 'డైరీ' - 1986 ఏప్రిల్ 14). కృష్ణ (మిసెస్ ఖురానా) చెప్పే తమిళనాడు యాత్రా విశేషాల గురించి వినాలని వున్నా, వినగల అవకాశం లేక పోయింది. ఏడున్నరకి 'టాజ్'లో 'అరుణ కిరణం' 150వ రోజు పండగ. మీటింగు జరుగుతున్నా బయటకొచ్చి, స్నేహాభిమానంతో సాగనంపారు కృష్ణా ఖురానా; ఆమె రేపు డూన్‌వెళ్లిపోతున్నారు. .... టాజ్ బాల్‌రూమ్ 'అరుణ కిరణం' షీల్డ్‌స్‌తో శోభాయమానంగా ఉంది. కృష్ణచిత్రా హరికృష్ణ ఆహూతులకు స్వాగతం తెలిపిన మీదట, అధ్యక్షులు నారాయణ రెడ్డి, చిత్రంలో పాల్గొన్న కళాకారులనీ సాంకేతిక నిపుణులనీ అభినందిస్తూ, దర్శకులు టి. కృష్ణ మనలను వీడి వెళ్లిపోవటం తీరనిలోటు - అన్నారు.

లేని మేటి చిత్రాలు సామాజిక స్పృహతో సందేశాత్మకంగా తనలోని అశాంతి జ్వాలలను వెండి తెర రూపాన వ్యక్తీకరిస్తూ, చిత్ర నిర్మాణం చేసి, చిన్న వయసులోనే దివికేగిన టి కృష్ణ అందరి మదిలోనూ మెదిలారు ముఖ్య అతిథి డివియస్ రాజు 'అరుణ కిరణం' విజయానికి అభినందనలు తెలిపారు కథకులు హరనాథరావు కార్యక్రమం నిర్వహించారు ఎంతో సొంపుగా ప్రశాంతంగా జరిగింది శతన్నర దినోత్సవం.

. . . . 9

"మహేంద్రగిరి శ్రీకాకుళంలో జిల్లా కొసని మూడురాష్ట్రాలు కలిసే చోట ఉంది. ఆదివాసులు ప్రతి శివ రాత్రికీ అక్కడికొచ్చి పెద్ద ఉత్సవం జరుపుతారు – అతి ప్రాచీన దేవళమది. శ్రీశైలంలోని మల్లికార్జునస్వామి ఆలయం కూడా సుప్రసిద్ధమైనది. సాటి ప్రభుత్వోద్యోగి అయిన కాశీ పాండియన్ 'ది హిడెన్ హెరిటేజ్' ('The Hidden Heritage' గ్రంథంలో తుంగభద్రా లోయకు చెందిన నాగరికతలోని విశేషాలు ఎంతో పరిశీలనాత్మకంగా వివరించారు," — అన్నారు టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు లక్ష్మీనారాయణ, – అంబురాజ్ తిరుక్కురళ్ ఎడ్యుకేషనల్ సొసైటీ ప్రారంభోత్సవ సందర్భంగా, మద్రాసు యూనివర్సిటీ సెనేట్ హాలులో జరిగిన గ్రంథావిష్కరణ సమావేశంలో. ఐ ఎ యస్ ఉద్యోగి అంబురాజ్, తన విధి నిర్వహణలో, మరొకరి ప్రాణాలు కాపాడబోయి, తన ప్రాణాలు పోగొట్టుకున్నాడు అన్నగారు కాశీ పాండియన్ (ఆయనా ఐ ఎ ఎస్సే - ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వంలో విద్యాశాఖ కార్యదర్శి - కర్నూలు, మహబూబ్ నగరజిల్లాలలో కలెక్టరుగా వుండేవారు), గతించిన తన సోదరుడు అంబురాజ్ స్మృతికి ఈ పుస్తకాన్ని అంకితమిచ్చారు తమిళనాడు ప్రభుత్వ ముఖ్య కార్యదర్శి పద్మనాభన్, హాండ్‌లూమ్ శాఖ డైరక్టరు మలైసామి, సోషల్ వెల్ఫేర్‌శాఖ కార్యదర్శి తంగరాయ్, తమిళ సంస్కృతిశాఖ కార్యదర్శి అవ్వయ్ నటరాజన్, పరంజోతి, జస్టిస్ వేణుగోపాల్, కున్రకుడి స్వామిజీ మున్నగువారి ప్రసంగాలు. చివరిదాకా వుందామనీ, కాశీపాండియన్ చెప్పేది విందామనీ ఎంతో అనిపించింది. కాని, తొమ్మిదిన్నరకి ఒక ఫ్రెండ్ వస్తున్నారు అప్పటికే తొమ్మిదవుతోంది –మాట్లాడవలసినవారు యింకా ముగ్గురువున్నారు, అందుకని లేవక తప్పలేదు. ప్రొఫెసర్ జి యన్ రెడ్డి, కాశీపాండియన్‌కి మమ్మల్ని పరిచయం చేసి వుందురు — కాని, మాకా అవకాశం, అదృష్టం లేకపోయింది .... "కాశీపాండియన్‌తో నాకు 1977లో, ఆయన కర్నూలు కలెక్టరుగా వున్నప్పుడు, పరిచయం ఏర్పడింది. అప్పట్లో నాకు ఈయన మంచి మిత్రులు, సాహిత్యాభిరుచిగల వారూ అని మాత్రమే తెలుసు-ఇంతటి పరిశోధనా తృష్ణ అయనలో వున్నదని తరువాత్త రువాత తెలిసింది..... ఈ గ్రంథంలో కాశీపాండియన్ వివాదాస్పదమగు కొన్ని విషయాలు ప్రతిపాదిస్తున్నారు.

హరప్పా మొహంజదారోలకి మల్లేనే తుంగభద్రా లోయది కూడా అతి ప్రాచీన చరిత్ర అంటున్నారు కర్నూలు గుహలలోగల చిత్రాలు ఎన్నో అపూర్వ విషయాలు వెల్లడిస్తున్నాయి యాదృచ్ఛికంగా జరిగిన పరిశోధనలే సత్యాన్వేషణకు బాట వేయడం మన సర్వత్రా చూస్తున్నాం అతి ప్రాచీన మానవుడు రేణిగుంట ప్రాంతాల తిరుగాడే వాడని ముందుముందు ఎవరైనా నిరూపించినా మనం ఆశ్చర్యపోనక్కర్లేదు వివాదమెప్పుడూ పుస్తకానికీ, పుస్తకంలోని విషయాలకీ జీవమిస్తుంది 'సిద్ధ' అనే శబ్దం రాయలసీమలో మనకి ఎక్కువగా వినిపిస్తుంది. ఎందువల్ల? తన మౌనంతో శిష్యునికి బోధ చేయగల సిద్ధపురుషులు ఒకప్పుడు వుండేవారని ప్రతీతి ఆ సిద్ధుల నుంచే 'సిద్ధా' శబ్దం వ్యాప్తమయింది .. 'ది హిడెన్ హెరిటేజ్' పుస్తకం మిమ్మల్ని కదిపి కుదిపి ఆలోచింపజేస్తుంది. ఇలాటి ఉపన్యాసాలు గాక దీనిపై ఒక సెమినార్ జరపడం ఎంతో సముచితం" – అన్నారు వెంకటేశ్వరా యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ జి యస్ రెడ్డి.

— యన్నార్ చందూర్

---

కలలు మన నిద్రకు కావలివారు - అంతేగాని అల్లరిచేసే వారు కాదు.

—ఫ్రాయిడ్

సందేహిస్తూ వుండటం సమంజసం కాదు గాని నిర్ధారించి చెప్పడం మరింత ఘోరం.

— వాల్టే

## పసిడి పలుకులు

శబ్దరహితమైన అరుపునే ఆవలింత అన్నారు.

—ఛెస్టరటన్

ఆపేరా కెళ్ళేదీ, ఆపరేషన్ కెళ్ళేదీ ఆమె డ్రస్ చూసి చెప్పలేరు.

—కాబ్

పత్రికా స్వాతంత్ర్యమనేది మీకొక పత్రిక ఉన్న మీదట.

—వీబ్లి

బట్టతల వల్ల ఒక సుఖం వుంది- పేలుపడవు.

—హెరోల్డ్

స్వల్ప విషయాలే మనని చికాకు పరిచి బాధ పెట్టేవి ఏనుగుని తప్పించుకోగలంగాని ఈగని ఏం చేయగలుగుతారు?

—విల్లింగ్స్

చిన్నప్పుడు క్లాసులో ఏ పిల్లవాడైనా ప్రెసిడెంటు కాగలడని చెప్పేవారు - ఇప్పుడది తప్పనిసరిగా నమ్మవలసి వస్తోంది.

—క్లారన్స్ డారో

మానవుడు తను నమ్మిన ఆదర్శం కోసం ప్రాణత్యాగం చేయడానికైనా సరే సిద్ధంగా ఉంటాడు - ఎటొచ్చీ, ఆ ఆదర్శ స్వరూపమే స్పష్టంగా బోధపడదతనికి.

—ఎల్ డ్రిజే

# మాలతీ చందూర్

## నవలలు

| | |
|---|---|
| వైశాఖి | 16 – 50 |
| కాంచనమృగం | 16 – 50 |
| భూమి పుత్రి | 16 – 00 |
| మధుర స్మృతులు | 14 – 00 |
| ఓ మనిషి కథ | 16 – 00 |
| ఏమిటీ జీవితాలు | 12 – 00 |
| మనసులోని మనసు | 25 – 00 |
| ఆలోచించు | 9 – 00 |
| రాగరక్తిమ | 18 – 00 |
| మేఘాల మేలిముసుగు | 16 – 00 |
| కలల వెలుగు | 15 – 00 |
| బ్రతక నేర్చినజాణ | 14 – 00 |
| జయలక్ష్మి | 20 – 00 |
| కృష్ణవేణి | 20 – 00 |
| ఏది గమ్యం ఏది మార్గం | 15 – 00 |
| ఎన్ని మెట్లెక్కినా | 18 – 00 |
| సద్యోగం | 15 – 00 |
| లావణ్య | 14 – 00 |

## ఇవిగాక

| | |
|---|---|
| వంటలు – పిండివంటలు | 30 – 00 |
| ప్రశ్నలు – జవాబులు | 15 – 00 |
| జాబులు – జవాబులు | 13 – 00 |
| అల్లికలు – కుట్లు | 30 – 00 |
| అందాలు – అలంకారాలు | 15 – 00 |
| మహిళలకు మధురజీవనం | 7 – 50 |
| దాంపత్య జీవితం | 12 – 50 |

20/– రూ॥ పైబడి పుస్తకములు తెప్పించుకొనేవారు, ముందుగా ఆ పుస్తకాల ధరకు 2 రూ॥ తగ్గించి M. O పంపితే, 2 రూ॥లకు మాత్రమే V P. పంపుతాము అందువలన మీకు అసలు ధరకే పుస్తకాలు అందుతవి.



## క్వాలిటీ పబ్లిషర్స్

**రామమందిరం వీధి - విజయవాడ-2**

# సమీక్షలు

# చిత్రజగతి

## రవి కిరణ్ వారి 'ఉదయం'

న్యాయవాది రాజారామ్ (శరత్ బాబు) కళ్లెదుట చూసిన సత్యాన్ని, న్యాయస్థానంలో నిరూపించ లేక, పోలీసు వ్యవస్థ, రాజకీయ కూటని, ధనబలమూ న్యాయ దేవత నెలా గుడ్డిదాన్ని చేస్తున్నాయో ప్రత్యక్షంగా తెలుసుకు ఉగ్రవాది అవుతాడు. వృత్తిరీత్యా డాక్టరైన విజయాదేవి (శారద) హింసవల్ల సాధించగల దేమీ వుండదనీ, హింస నుంచి జనించేది అరాచకమేననీ రాజారామ్‌కి నచ్చ జెప్పేందుకు ప్రయత్నించి విఫలురాల వుతుంది. ఆవిధంగా పద్దెనిమిదేళ్ల క్రితం విడిపోతారు భార్యా భర్తలు. నా కూతురు నీవద్ద పిరికిదానిలా బతకకూడదు – అని ఏడాదిన్నర కూతురుని తీసుకు వెళ్లిపోతాడు రాజారామ్. ఆ అమ్మాయి (రజని) భూషయ్య (వీరభద్రరావు) అనే దేశ భక్తుని వద్ద పెరుగుతుంది ఇరవై ఏళ్లు వస్తాయి. పైకి చాదస్తుడిలా కనిపించే భూషయ్య, ఉగ్రవాదులకీ సమాజానికీ మధ్య గల వంతెన. నడుపుతున్న హొటలూ చూపిస్తున్న చాదస్తం ఒకవిధంగా ఆయన ధరించిన ముసుగు. ఆయన ధ్యేయ మేమిటంటే, రాజా రామ్ కూతుర్ని బాగా చదివించి, కలెక్టరు చేయడం పైకి ఆమాట అంటున్నప్పటికీ ఆ అమ్మాయి కలెక్టరైనా ఒకటే, కమ్యూనిస్ట్ అయినా ఒకటే – ఎటొచ్చీ తండ్రికి తగ్గ తనయ అనిపించుకుంటే చాలు ఉగ్రవాదులకీ వ్యవస్థకీ మధ్య భూషయ్యా లాటి వారు వందలూ వేలూ ఉన్నారంటాడు. రిక్షా మనిషి తన కూతురు ఉరిపోసుకోడానికి కారణం భాస్కరరావు కొడుకు జరిపిన అత్యాచారం అని తెలిసికూడా, పోస్ట్ మార్టమ్ వొద్దుమొర్రో అంటూ శవానికి అంత్యక్రియలు జరిపించిన అధునిక బానిసీడు – నిరంతర శ్రామికుడు ; నిప్పు లాంటి నిజం గుండెల్లో దాచుకుంటూ కర్మసిద్ధాంతానికితలవొగ్గే అనాది పేద. భూషయ్యతటస్థుడు. నేను సైతం ప్రపం చాగ్నికి సమిధనొక్కటి . . . , అనే ఉగ్ర వాది రాజారామ్. నినాదాలతో శోషిల్లే ప్రజాబలాన్ని నమ్మమనే అహింసావాది డాక్టర్ విజయాదేవి పట్టణ మేయరై, తన అంగ రక్షకుల వల్ల కాల్చా బడగా, రాజా రామ్ మార్గాన వెళ్తున్న భాను (భానుచందర్), కపట నాటకీయు లందరినీ క్లయిమాక్స్‌లో

స్టెన్‌గన్‌తో దడ దడా కాల్చేసి, రేపటి ఉదయానికి తనని తాను అర్పించు కుంటాడు ఇందిరా గాంధీ హత్యకు సంబంధించిన ఛాయలు యిందులో లేకపోలేదు, కడపటి రక్తపు బొట్టు దాకా ప్రజల కోసం_పోరాడుతాను - అని ఆమె ఒరిస్సాలో అన్నట్లే విజయా దేవీ అంటుంది విజయా దేవిది ఇందిరా గాంధీ అంత ఎత్తుకి ఎత్తవలసిన పాత్ర కాకపోయినప్ప టికీ నాటకీయత కోసం చేశారని పిస్తుంది విలన్ పాత్ర గాక, శరత్ బాబు, శారద, భానుచందర్, వీరభద్ర రావు ఈ నలుగురూ ముఖ్యులు అందరూ బాగా చేశారు దర్శకులు కోడి రామకృష్ణ నిర్మాత డి నరసా రెడ్డి

## మహేశ్వరీ వారి 'దొంగ మొగుడు'

రవితేజా టెక్స్‌టైల్స్ యజమాని రవితేజకి (చిరంజీవి) - ఆకృతి, ఛాయ, ఎత్తు - వీటిని బట్టి ఏ యువతికి ఎటు వంటి డిజైను గల చీరె అందంగా నిండుగా ఉంటుందో బాగా తెలుసు ఆడ పిల్లలు యితని ఆటోగ్రాఫ్ కోసం వచ్చేటంత వెర్రిలో ఉంటారు రవితేజ భార్య లలితకి (మాధవి), అత్తగారికి (రాజసులోచన) పార్టీలూ మీటిం గులూ ఆడంబర జీవితమూ తప్ప యింటి ధ్యాస ఉండదు. ఇల్లు బట్టిన బావమరిది (గిరిబాబు) 'ఒక నూరు కొట్టండి, బావగారూ' సాయింత్రం వేధిస్తూ వుంటాడు. రవి తేజకి వ్యాపారంలో ప్రత్యర్థులు వెంచు టెక్స్ టైల్స్ - అక్కడున్న దుష్ట త్రయం రావుగోపాలరావు, గొల్లపూడి మారుతీరావు అల్లు రామలింగయ్య వీరు లోగడ ఒక మంచి వానిని (రంగనాథ్) మర్డర్ కేసులో యిరికించి, వెండి తెర వినోద ఫక్కీలో అతని ఐశ్వర్యమంతా కాజేసిన అఖండులు ఇక, నాగరాజు అని (చిరంజీవి) ఒక స్టంట్‌కింగ్ వున్నాడు, అతనికి ప్రత్యర్థి స్టంట్ క్వీన్ (రాధిక) వీరిద్దరూ ఉత్తరోత్రా ఒకటవడం సహజ పరి ణామం. ఈ నాగరాజాకి ఒక అక్క గారు (జయంతి) ఉంది. ఆ అక్కగారు మొదట చెప్పిన మంచి మనిషి భార్య. ఈ దంపతుల కుమార్తె ప్రియాని (భానుప్రియ), రవి తేజని పడగొట్టి బ్లాక్ మెయిల్ చేసేందుకు, తద్వారా సర్వనాశనం చేసేందుకు వినియోగిస్తారు విలన్‌లు నాగరాజు, రవితేజ ఒకే పోలికని వుండటంవల్ల, స్థలాల మార్పిడి ద్వారా అస్వాభావిక నాటకీయత కొంత జనిస్తుంది ఫార్ములా కథ. నవ్యత ఏమీ లేకపోయినా, ఎంటర్‌టైన్ చేస్తుంది. బట్టల వర్తకుల మధ్యగల పోటీ యింతటి దైన్యస్థితిలో వుందని అనుకో లేము. ద్విపాత్రాభినయంలో చిరంజీవి భేష్ అనిపించుకున్నాడు. స్టంట్‌క్వీన్‌గా, రాధిక, జాలి వొలకబోసే జయంతి బోనులో యిరుక్కున్న రంగనాథ్, తండ్రిని కాపాడేందుకు సెక్రటరీగా చేరిన భానుప్రియ, సినీ విలన్‌లూ-

అందరూ బాగా చేశారు స్వప్న డోలి కలలోని ప్రేమ జంటల పాటలు రస భూయిష్టంగా వున్నాయి బాక్సాఫీస్ విజయం తథ్యమనిపించే ఈ చిత్రానికి దర్శకులు కోదండరామిరెడ్డి నిర్మాత వెంకన్న బాబు

## ఎవియమ్ వారి 'సంసారం ఒక చదరంగం'

'సంసారం — మిన్సారమ్' తమిళ చిత్రం సమీక్ష 1986 నవంబరు నెల 'జగతి' లో వెలువడింది "విడిపోయిన మనం విడిగానే వుందాం — ఆదివారా లప్పుడు మాత్రం అందరం కలుసుకుందాం, అదే గౌరవప్రదం - అనే నిర్ణయం తీసుకు, ఆ ప్రకారం జరుపుతుంది; ఆమె మనోవ్యథలో ఎందరో పెద్ద కోడళ్ల ప్రతి రూపం కనిపిస్తుంది ఇందులో ఎవరూ దుర్మార్గులు కాదు సామాజిక పరిస్థితులిచ్చే 'షాక్'కి తట్టుకుంటూ బతకవలసినవారు. షాక్ తినని పాత్రలేదీ పిక్చర్లో! ప్రతి ఒక్కరూ ఏదో విధంగా అనుకోని విద్యుద్ఘాతానికి లోనయేవారే! సాంఘిక పరిస్థితులనీ, సామాజిక వాస్తవికతనీ ఎంతో హృద్యంగా, రసభరితంగా, కరుణార్ద్రమగు కన్నీటి వెలుగులతో చూబుతున్నది గనకనే, ప్రేక్షకులు యింతగా ఆదరిస్తున్నారు ఈ తమిళ చిత్రాన్ని" - అని వ్రాశాము.... ఇది 'అర్బన్ ఆడియన్స్'కి సంబంధించిన చిత్రం కోయంబత్తూర్, తిరుచ్చి, సేలం, మధురై, మద్రాసు వంటి వాతావరణం కొంత మేర విజయవాడ" హైదరాబాదులలో వున్నదేమో గాని విశాఖపట్నంలో లేదు. అయితే, చిలకమ్మ పాత్ర (షావుకార్ జానకి) ఈ లోటుని భర్తీ చేస్తోంది. తమిళ చిత్రం చూసినవారికి చిలకమ్మ ఒక్కతెలోనే తెలుగుతనం కనిపిస్తుంది 'ఆంధ్రా'లో గోదావరి అనే ఆడపేరు చాలా అరుదు ఇంటి పెద్ద అప్పల నర్సయ్య చేసినప్పుడు, యిల్లాలిని కూడా మార్చివుండవచ్చు అరుణ, కల్పన, శరత్‌బాబు, రాజేంద్రప్రసాద్, నూతన్ ప్రసాద్, దిలీప్, హేమసుందర్ బాగా చేశారు. సుహాసిని పెర్ఫారమెన్స్ ఆమె వరవడిలో బావుంది గాని లక్ష్మి వొప్పించి నంతగా లేదు. గొల్లపూడి మారుతీరావుకి తెలుగు ప్రేక్షకులలో గల ఇమేజ్ వేరు ఇక్కడ ఈ పాత్ర స్వరూపం లేరు, కష్టపడి చేసినప్పటికి, విసు చూపిన (తమిళంలో) వేదనాభరిత మధ్యతరగతి మనస్తత్వం వ్యక్తం కాలేదు అలాగే గోదావరి తమిళ చిత్రంలో సన్నగా వుండటం (నలుగురు పిల్లల తల్లి -చాలీచాలని సంసారం) కూడా సమంజసంగా ఉంది. ఇక్కడ అదేమంత పెద్ద విషయం కాదు — అన్నపూర్ణ కూడా బాగా చేసింది. ఇకపోతే, మనోరమ ధరించిన కణ్ణమ్మ పాత్రని, చిలకమ్మగా షావుకారు జానకి వేసింది; అంతేకాదు; ప్రధాన కథలో ఈ పాత్ర అంతర్భాగమవుతుంది. షావుకారు జానకి ఎంతో చక్కగా చేసింది .. రాఘవ, వసంత విశాఖపట్నం నుంచి అరకు వెళ్తూ,

హొటల్లో బసచేయడమేమిటి? అరకు లోయలోగాని, మార్గమధ్యంలో గాని బసచేయగల హొటల్స్ ఎక్కడున్నాయి? విశాఖలోని మధ్య తరగతి పౌరుడు, నైట్ వాచ్‌మాన్‌గా పని చేస్తాడా? .. 'సంసారం ఒక చదరంగం - అనుబంధం ఒక రణరంగం' అని పాట కట్టారే తప్ప, ఈ చిత్రంలో చదరంగపుఎత్తులు ఎక్కడా లేవు దర్శకత్వం ముత్తురామన్ నిర్మాత: శరవణన్

## ప్రసన్నలక్ష్మి వారి 'వీరప్రతాప్'

సైన్యాధిపతి (గిరిబాబు) తన సైనికులతో గ్రామంపైబడి దోచుకుంటూ, ఒక కన్నెపిల్లని మానభంగంచేసి, ఆమె దారుణమరణానికి కారకుడవుతాడు. ఆ అభాగ్యురాలి శవం రెండు చేతుల్లో పుచ్చుకు, గ్రామప్రజలు వెంటరాగా, రాజ దర్బారుకి వస్తాడు ప్రతాప్ (మోహన్‌బాబు). అసమర్థుడైన రాజు (ధూళిపాళ) సైన్యాధిపతి చేతిలో కీలుబొమ్మ. దర్బారులో హీరో విలనుల కత్తియుద్ధంలో ప్రారంభమైన ఈ జానపద మంత్ర తాంత్రిక గాథ, సైన్యాధిపతి చెయ్యి తెగిపోగా, మాయల మాంత్రికుని వైపు మళ్ళుతుంది. రాజుగారి కుమార్తె పద్మావతి (మాధవి) వీరప్రతాప్‌ని ప్రేమించి అతనితో వెళ్ళిపోతుంది. అరణ్య మధ్యాన ఈప్రేమ జంట మాంత్రిక ద్వయం (సహొదర సహొదరీలు) పాలబడతారు. సహొదరి ప్రతాప్‌ని కామించి, తన పటువిడిచి అతను పారిపోకుండా వుండేందుకు కుందేలుగా చేస్తుంది సహొదరుడు పద్మావతిని మోహించి, ఆమె ఎప్పటికైనా మనసుమార్చుకు తన వశమయేందుకు పంజరంలో చిలకగా చేస్తాడు కోయదొరవద్ద క్షుద్రవిద్య నేర్చి, గాడిదగా మారిన ప్రతాప్ అనుంగు సోదరుడు (రాళ్లబండి) శాపవిమోచన పొంది, బంగారుచేప కృపవల్ల ఎంతో శక్తిమంతుడవుతాడు జింకపై గగన యానం చేస్తూ, తను కోరినదల్లా భావవేగాన నెరవేర్చుకో కలుగుతూ, పద్మావతి చెల్లెలుకి మనోనాథుడవుతాడు. మానిని అనే మరో మంచి మాంత్రికురాలి కరుణాకటాక్ష వీక్షణంతో, ఆమె సద్బుద్ధి కారణంగా వీరప్రతాప్, ఎన్నో సాహస కార్యాలు చేసి, మోసగాళ్ళ ప్రాణాలు గల బొమ్మల్ని పట్టుకొస్తాడు. తనకు దక్కని పద్మావతిని సజీవ దహనం చేసే ప్రయత్నంలో వుంటాడు మాంత్రికుడు, ఆమెని కాష్ఠంపై పడుకోబెట్టి నిప్పంటించబోతూ వుండగా మాంత్రిక ద్వయం ప్రాణాలు గల బొమ్మలతో ప్రత్యక్షమవుతాడు వీరప్రతాప్: ఒక బొమ్మ పీకె తను నులిమితే, మరొక బొమ్మ పీకె నులిపేందుకు యింకొకరు వుండాలి గనక, సరిగా సమయానికి వస్తాడు ఎగిరే జింక మీద అనుంగు సోదరుడు. అవిధంగా- దుష్టసంహారం జరిగి, పద్మావతీ ప్రతాప్‌లకు పరిణయమవుతుంది. కామె

రూపవిద్య అపరి పక్వ మనస్కుల నెప్పుడూ ఆకర్షిస్తూ వుంటుంది ఇటు వంటి చిత్రాలు చిన్నపిల్లలకు హేడుపు కాసేపు వొదిలేసి 'కాశీమజిలీ' వేదా మనుకొనే వారికీ బావుంటాయి. దర్శ కత్వం విరలాచార్య

## విజయ పద్మాలయా వారి 'తండ్రీ కొడుకుల ఛాలెంజ్'

తండ్రి (సత్యనారాయణ) పెద్ద పోలీసాఫీసరు - ఐజి కావచ్చు; తల్లి (జయంతి) ఆ ఊరు హాస్పిటల్లో లేడీ డాక్టరు, అన్నగారు (రంగనాథ్) పబ్లిక్ ప్రాసిక్యూటర్, కథానాయకుడు (కృష్ణ) రాజా, నేర్పూ చాకచక్యమూ గల న్యాయవాది చిన్నప్పట్నించీ తమ యింట్లో తమతో బాటే పెరిగిన మేనత్తకూతురు జ్యోతి (సుమలత) చిన్నబావపై ఆశలు పెంచుకుంటుంది ఒకసారి రాజా తల్లి హెచ్చరిస్తుంది. 'అదేమిటమ్మా, నిన్ను పెద్దబావకని మీ మామయ్య అనుకున్నారు - మరణ శయ్య మీదున్న మీ అమ్మకి మాట యిచ్చారు' .. ఆయన మాట యిచ్చినది యింటికి కోడలుగా చేసుకుంటానని! అన్నగారు రాము ఒక జానకిని (దీప), తలిదండ్రులకు భయపడి వంచింప బోగా, నాలుగో నెలలోవున్న ఆ అమ్మాయికి న్యాయం చేకూరుస్తాడు న్యాయవాది రాజా, పెద్దబావకి పెళ్లయి పోయింది కదా, చిన్నబావ తన వాడేనని, 'మాఘమాస మొచ్చాక మంచు వెన్నెలొచ్చాక....' ఎదిగినోడు పూరుకుంటాడా, ఎదిగినమ్మ వూరు కుంటుందా, అని రమ్యకాంతుల రస లీలలో స్వప్నలోకాన తన్మయురాలవు తుంది జ్యోతి అయితే, ఈ రాజా బావ 'ఒంపుల సొంపులు చంపలకెంపుల' గంపల కెత్తించే ఒక గౌరి (రాధ) ప్రేమ యాత్రలో వుంటాడు. ఈ గౌరి తండ్రికీ (గొల్లపూడి), రాజా తల్లికీ, కాలంతో కరగని కక్ష ఒకటి వుంది. దానిని సాకుగా తీసుకొని విలన్, గౌరి తండ్రిని చంపి, ఆ నేరం రాజా తల్లిపై పడేటట్టు చేస్తాడు. పక్కన ఫస్ట్ ఎయిడ్ బాక్సూ కాటనూవున్నా, లేడీ డాక్టరైన తల్లిని, పోలీసాఫీసరైన తండ్రి, అరెస్ట్ చేయిస్తాడు పాత వైరం కారణంగా గౌరిని కోడలుగా ఆమోదించేందుకు యిష్టంలేక, పగబట్టి గౌరి తండ్రిని హత్య చేసిందని అభియోగం: పెద్ద కొడుకు పబ్లిక్ ప్రాసిక్యూటర్, చిన్న కొడుకు తల్లి తరఫు న్యాయవాది; పోలీసాఫీసరైన తండ్రి, విట్నెస్ బాక్స్‌లో నిలబడి సాక్ష్యం చెబుతాడు. అతిసమర్థుడైన రాజా తన తల్లి ఈ హత్య చేయలేదని గుడ్డివానిలా మసలు తున్న సిబిడి సాక్ష్యంలో కోర్టులో నిరూ పిస్తాడు – ఆమెని నిర్దోషిగా విడుదల చేస్తారు. నాటు బాంబుల ఫాక్టరీ ఒక టుంది; దాని వునికిని కనిపెట్టిన న్యాయ వాది రాజాని, పోలీసు శాఖ అభినంది స్తుంది. రాజా గౌరీల వివాహ ఘనంగా జరుగుతుంది. మేనత్త కూతురు జ్యోతి ఏమయిందనా మీ ప్రశ్న? చిన్న బావ, గౌరి అనే పల్లెపడుచుని ప్రేమించాడని

తెలుసుకు, మేడమీద నుంచి దూకి కొన్నాళ్ళు హాస్పిటల్‌లో వుండి, చిన్న బావ తననే పెళ్ళి చేసుకొనేందుకు నిశ్చయించుకున్నాడనే మంచి మాట విని, తిరిగి జీవితంపై ఆశలు కల్పించుకు కోలుకుంటుండగా, గౌరి తండ్రి పలికిన కఠోరవాక్కులకు మళ్ళీ రెండవసారి చేసిన ఆత్మహత్యా ప్రయత్నంలో మరణిస్తుంది .. కుటుంబ బంధాలు పరస్పర విశ్వాసంతో ఏర్పడేవి వాటి మధ్య నాటకీయతకు అవకాశంలేదు తండ్రీ కొడుకులూ అన్నదమ్ములూ, వాదీ ప్రతివాదుల కేసులు, ముఖ్యంగా సివిల్ కేసులు పట్టడం వింటాం అయితే, వారిద్దరూ ఒక యింట్లో వుండరు; ఒక టేబుల్ దగ్గిర భోంచేయరు. నా భార్య దోషి అని తండ్రి, నా తల్లి నిర్దోషి అని కొడుకు — యిది తండ్రీ కొడుకుల ఛాలంజ్ ఇంటి పెద్దగా సత్యనారాయణ ఇల్లాలిగా జయంతి; అన్నావొదినలుగా రంగనాథ్, దీప చక్కగా చేశారు. గొల్లపూడి పాత్రలోని స్వాభావికత చెప్పుకోదగ్గది. హీరో కృష్ణ పెర్‌ఫారమెన్స్ బావుందని చెప్పడమనవసరం - బావుండకేం చేస్తుంది? ధరించే ప్రతి పాత్రకు స్పందన సమకూర్చడం అతని ప్రత్యేకత. చిలకల కొలికి చిటి మరదలుగా సుమలత, వయ్యారమే తుళ్ళింతగా గల రాధ ప్రేక్షకులని మెప్పిస్తారు దర్శకత్వం యమ్ మల్లికార్జునరావు. నిర్మాత: యమ్వీ రామారావు. ❋

## జెబి ఆర్ట్స్ వారి 'భార్గవ రాముడు'

ప్రతాపరావు (రావుగోపాలరావు) ఒక పోలీసాఫీసరు — ఐపి యస్ గనక సూపరెంటు అనుకుందాం; ఆయన సోదరుడు (జగ్గయ్య) ఒక ఛీఫ్ యింజనీరు, ఆ ఛీఫ్ యింజనీరుగా రమ్మాయి కధానాయిక లలిత (విజయశాంతి). భార్గవ్ (బాలకృష్ణ) ఒక అసిస్టెంట్ యింజనీరు, భార్గవ్ తండ్రి (రంగనాధ్) కల్పితహత్యానేరం కారణంగా జైలులో మగ్గుతూంటాడు. తల్లి (అన్నపూర్ణ) ఒక అర్జంటు ఆపరేషనుకు లోనై, సర్జన్ పొరబాటువల్ల (కత్తెర కడుపులో వుండిపోతుంది) మరణిస్తుంది భార్గవ్‌కి ఒక చెల్లెలు (అరుణ), ఒక బావ (చంద్రమోహన్) వున్నారు ఇరవై ఏళ్లగా రాజకీయాలలో వున్న రాజశేఖరం (గొల్లపూడి) ఒక మంత్రిగారు, — పరమ దుర్మార్గుడు; కాంట్రాక్టరుతో ఫిఫ్టీ - ఫిఫ్టీకి చేతులు కలిపి, తన వంతు స్విస్ బాంకులో డిపాజిట్ చేయమంటాడు; ఈ మంత్రిగారూ మంత్రిగారి తమ్ముడు (పరుచూరి), కాంట్రాక్టరూ దుష్టత్రయం రాత్రికి పదివేలు పుచ్చుకొనే ఒక విలాసిని (మందాకిని) మంత్రిగారి పెంపుడు కూతురు; కాల్ గరల్ కర్తవ్యం నెరవేరుస్తూ వుంటుంది. ఈ అమ్మాయి తండ్రి మరణానికి కారకుడు

యుద్ధానికి వెళ్లివచ్చినవారి కబుర్లు సరదాగా ఉంటాయి - వారు యుద్ధం చూశారుగనక! చంద్రుని గురించి కవులు చెప్పే కబుర్లు కఠోరంగా ఉంటాయి వారు చంద్రుని వద్దకు వెళ్లలేదు గనక! మార్క్‌ట్వేన్

